# ఆర్వియార్

# భగవద్గీత-మార్క్సిజం



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 500 001.

# భగవద్గీత-మార్క్సిజం

ఆర్వియార్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్-500 001.

BHAGAVADGITA - MARXISM BY RVR

రాజకీయ/సామాజిక/ఆర్థిక గ్రంథాలు

ప్రచురణ నెం. : 7

ప్రథమ ముద్రణ : జూలై, 2002



వెల: రూ. 10-00

ప్రతులకు . విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



ముద్రణ: శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు.

# ఇందులో...





# విశాలాంధ్ర నూతన ప్రచురణలు, సోల్ డిస్ట్రిబ్యూషన్ పుస్తకాలు.

## (జనవరి - జూన్ 2002)

| | రూ. |
|---|---|
| 1. మల్లాది రామకృష్ణశాస్త్రి (నవలలు-నాటికలు) - మల్లాది నరసింహశాస్త్రి | 120 |
| 2. డా॥ వాసిరెడ్డి సీతాదేవి సాహిత్యం-III (కథలు) | 140 |
| 3. కౌన్సిలింగ్ కబుర్లు - డా॥ బి.వి. పట్టాభిరామ్ | 60 |
| 4. స్కూల్ విద్యార్థులకు కంప్యూటర్ - సుధామూర్తి | 20 |
| 5. ఆరుద్ర సినీగీతాలు-II (తళతళా మిలమిలా పగటిపూట వెన్నెలా) | 75 |
| 6. విమర్శాశిల్పం - వల్లంపాటి వెంకట సుబ్బయ్య | 50 |
| 7. నిత్యజీవితంలో వృక్షశాస్త్రం - డా॥ బి.జి.వి. నరసింహారావు | 50 |
| 8. కృతయుగం (ఒక వక్రీకరణ) - ప్రొ. కె. శేషాద్రి | 10 |
| 9. విద్య కాషాయీకరణ ప్రతిఘటిద్దాం - ఆర్వియార్ | 10 |

## సోల్ డిస్ట్రిబ్యూషన్ పుస్తకాలు

| | |
|---|---|
| 10. డా॥ దాశరథి రంగాచార్య రచనలు-6 (అనువాద నవలలు) | 125 |
| 11. డా॥ దాశరథి రంగాచార్య రచనలు-7 (అనువాద కథలు) | 125 |
| 12. Global Quotations - *P. Rajeswara Rao* | 25 |
| 13. స్వేచ్ఛ (ఆదిలోనూ-అంతంలోనూ) - జిడ్డు కృష్ణమూర్తి | 100 |
| 14. ఆడవారిని అర్థం చేసుకోవడం ఎలా? - అట్లూరి వెంకటేశ్వరరావు | 45 |
| 15. హిందీ-తెలుగు శబ్ద రత్నాకరము-వేమూరి రాధాకృష్ణమూర్తి | 125 |
| 16. నీవే ప్రపంచం - జిడ్డు కృష్ణమూర్తి | 50 |
| 17. సాహిత్య కబుర్లు - డా॥ ద్వా.నా. శాస్త్రి | 50 |

ప్రతులకు: **విశాలాంధ్ర బుక్ హౌస్‌లు, ప్రముఖ పుస్తక విక్రేతలు.**

# భగవద్గీత - మార్క్సిజం

భగవద్గీత హైందవధర్మాన్ని నిలబెట్టే ప్రామాణిక గ్రంథంగా ప్రఖ్యాతి చెందింది. వేదాలు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు యీ జీవిత విధానానికి చెందిన సనాతన ధర్మాన్ని ప్రవచిస్తూ వున్నాయి. సామాన్య అర్థంలో మతం అనే పదం నీడకు చేరని జీవిత విధానానికి ఒక వ్యవస్థీకృత రూపం యిచ్చే బృహత్తర కార్యాన్ని యివన్నీ నిర్వహిస్తున్నాయి. బౌద్ధ, జైన, క్రైస్తవ, ఇస్లాం, సిక్కు మత దృక్పథాలకులాగా యీ సనాతనధర్మంగా వ్యవహరించేదానికి ఒక ప్రవక్త లేడు. సాధికారక ప్రతీకాత్మక గ్రంథం లేదు.

*శ్రుతిర్విభిన్నా స్మృతయశ్చ భిన్నా:*
*నైకోమునిర్యస్యవచ్చ ప్రమాణం*
*ధర్మస్యతత్త్వం నిహితం గుహాయాం*
*మహాజనోయేన గతఃసపంథాః*

అని "మహాభారతమే" ప్రకటిస్తోంది. అంటే శ్రుతిచోదిత మార్గాలు భిన్నాలు, స్మృతి విధానాలూ భిన్నాలు. ఏ రుషివాక్యాన్ని అప్రమాణంగా తోసి వెయ్యడానికిలేదు. ధర్మనిర్ణయం అత్యంత జటిలం. ఏది ధర్మం, ఏది అధర్మం అనే సంకట పరిస్థితి ఎదురైనపుడు శ్రుతి, స్మృతి శాస్త్రాలవల్ల చిక్కువిడిపోనపుడు ముందటి మహాత్ములు నడిచిన దారే మనకీ మార్గం అని అర్థం. ఇదే భావాన్ని భగవద్గీతా ప్రకటిస్తోంది.

*యద్య దాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః!*
*స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తవే* (3,21)

అని గీత మూడవ అధ్యాయం "కర్మయోగం" లో గీతాకారుడు కర్మానుసరణం గురించి వివరిస్తూ చెపుతాడు. అయితే ఆ శ్రేష్ఠులు, గీతలో ఉదాహరణగా చెప్పిన జనకుని లాంటివారు, ఆ శ్రేష్ఠత్వం యెలా పొందారు

అనేది తెలియవలసే వుంది. గీతలో అయితే దానికి వివరణ వుంది - కర్మ చెయ్యడంలో వాళ్ళు నిష్కామంగా వున్నారని. అయితే గీత చెప్పింది ప్రామాణికం కావాలీ అంటే దానికీ తగినంత నేపథ్యం ఉండాలికదా! గీత అనేక దృక్పథాలని సమన్వయం చేసి ఆ హోదా పొందింది అని చెప్పవచ్చు. గీత సనాతన ధర్మాన్ని భగవంతుని వాణిగా ప్రతిబింబిస్తూ హైందవ జీవిత దృక్పథ దర్పణంగా నిలబడుతూ వుంది. "సయత్ప్ర మాణం కురుతే" అని గీతలో వున్న స్మృతికారులు ఆయా ధర్మాలని విహితం చేస్తూవున్నా అసలు ప్రమాణం శ్రుతులే.

## శ్రుతులు - స్మృతులు అంటే...

శ్రుతులంటే ఏమిటి, స్మృతులంటే యేమిటి? శ్రుతులే వేదాలు అవి వెల్లడైనవి, తద్వారా గ్రహించినవి. శ్రుతం అంటే విన్నది. అవి యే ఒక వ్యక్తో కూర్చినవీ కావు, అన్నవీ కావు. అవి వ్యక్తికృతం కాదు కాబట్టి అపౌరుషేయాలు, అంటే పురుషకృతం కానివి. స్మృతులు అంటే అర్థం గుర్తు చేసుకున్నవి. వీటిని మారుతున్న కాలానికి అనుగుణంగా వేదం కరతలామలకంగా తెలిసిన విజ్ఞులు వివరణ చేశారు. స్మృతులు మానవజీవితాన్ని నడిపించడానికి వేదాలనుంచి గ్రహించిన శాశ్వత సత్యాలని అనువర్తింపచేస్తాయి. ఆరకంగా అవిచ్ఛిన్న వారసత్వాన్ని అలా కొనసాగిస్తూ ఉంటాయి. స్మృతుల్ని వాటి కర్తల పేరుమీదుగా వ్యవహరించడం ఆచారంగా వుంది. ప్రఖ్యాతంగా వున్నవి మను, యాజ్ఞవల్క్య, పరాశరస్మృతులు. వేదాల సత్యాన్ని ప్రకాశింపచేసే మహత్తర ఉద్దేశంతో రూపుతీసుకున్నవే అయినా స్మృతులకీ, శ్రుతులకీ విభేదం తలెత్తే సందర్భాల్లో యేది ప్రమాణం అవుతుంది? శ్రుతినే ప్రమాణంగా తీసుకోవాలిగాని స్మృతినికాదు. ఏమంటే, స్మృతి అందించేవి శ్రుతులలో వున్నవే. శ్రుతి - స్మృతి వివాదాన్ని జైమిని తర్కించేడు. ఆ తగాదాల్ని పరిష్కరించేందుకు కటువైన కృషి చెయ్యాలని కుమారిలుడు అన్నాడు. శబరముని యిలా శ్రుతి, స్మృతి విభేదాల్ని కనీసం మూడు సందర్భాల్లో గుర్తించేడు. ఉదాహరణకు ఔదుంబర (మోదుగ) కర్రని తాకే ముందు వేదపురోహితుడు మంత్రం చదవాలని వేదం చెపుతోంది. మొత్తం మోదుగు కర్రని వస్త్రంలో చుట్టాలని స్మృతి చెపుతోంది. కొడుకు

వున్నవాడు, జుట్టు నెరియనివాడు మాత్రమే వైదిక అగ్నిహోత్రాన్ని పవిత్రం చెయ్యాలని వేదం చెపుతుంది. నలభై ఎనిమిదేళ్ళు వేదాధ్యయనం చేసేవాడు వుండచ్చని స్మృతి చెపుతోంది. ఇలా విభేదాలు వున్నాయి. శబర, జైమినులు స్మృతి నియమాలని పక్కకుపెట్టవచ్చని అన్నారు. కుమారిలుడు యీ సందర్భాల్లో వైరుధ్యం లేదని అన్నాడు. అసలు వైరుధ్యం రెండు వేదశాఖల్లోనే వుందని అన్నాడు. అంచేత దేన్ని ప్రమాణంగా తీసుకోవడం అనేది నిర్బంధమైలేదు.

## దర్శనాలలో ముఖ్యాంశం ఏది?

వేదాల ప్రమాణం అంగీకరించడం, అంగీకరించకపోవడం అనేదే భారతీయ దర్శనాల్లో ముఖ్యమైన అంశం. షడ్దర్శనాలు అని యివి ఆరు. ఆస్తిక, నాస్తిక విభేదం వేదాలని అంగీకరించడంమీదనే ఆధారపడింది. వేదాల్ని ప్రమాణంగా అంగీకరించేవి ఆస్తికం. అంగీకరించనివి నాస్తికం. ఇక్కడ దేవుణ్ణి నమ్మడం నమ్మకపోవడం అనే సమస్య లేదు. ఇంగ్లీషులో థీయిస్ట్, ఎథీయిస్ట్ అని భగవత్ విశ్వాసం ప్రకటించే పదాలకు ఆస్తిక, నాస్తిక అని తెలుగులో అనువాదం చేస్తున్నారు. కాని అది సరికాదు. ఆ మాటలకు భగవంతుణ్ణి నమ్మడం, నమ్మకపోవడం అర్థాలలో ఈశ్వరవాది, నిరీశ్వరవాది అని చెప్పుకోవాలి. ఈ ఆరు దర్శనాలూ వేదాధికారాన్ని ప్రమాణంగా స్వీకరించేవే అయినా ఈశ్వరుని విశ్వసించని దర్శనాలూ వున్నాయి. అంచేత యీ ఆరింటినీ పరిచయం చేసుకోవడం అవసరం. ఇవి సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, మీమాంస, ఉత్తరమీమాంస.

## సాంఖ్యంలో శాఖలు

సాంఖ్యం కపిలముని స్థాపితం. అసలు సాంఖ్య అంశాలు ఉపనిషత్‌లలోనే వున్నాయి. అయితే వాటిని వ్యవస్థీకరించి రూపు యిచ్చి నిర్మించినవాడు కపిలుడు అని అంటారు.

ఈ సాంఖ్యంలో సేశ్వర (ఈశ్వరుణ్ణి విశ్వసించే), నిరీశ్వర (ఈశ్వరుణ్ణి విశ్వసించని) అని రెండు శాఖలు వున్నాయి. సేశ్వర సాంఖ్యం పతంజలి కృతం అంటారు. దాన్నే యోగ అంటారు. నిరీశ్వర సాంఖ్యంలో అతి ప్రాచీన గ్రంథం క్రీ॥శ॥ 3వ శతాబ్దానికి చెందిన ఈశ్వర కృష్ణకృతం.

పతంజలి క్రీ॥పూ॥ రెండవ శతాబ్దినాటివాడు. సాంఖ్య, యోగ దర్శనాలు హిందూ సంస్కృతినీ, మతాన్ని అనేక విధాలుగా ప్రభావితం చేశాయి. సాంఖ్యం ప్రకారం ప్రకృతి అంటే అసలు పదార్థం. మూల పదార్థం. త్రిగుణాత్మకం అయింది యిది. సత్వ, తమో, రజో గుణాలు. సత్వ గుణం సత్వాన్ని సాత్విక ప్రవృత్తిని కలిగి వుంటుంది. రజో గుణం క్రియాశీలం, భీషణం. తమో గుణం మందం, అంధకారం. వాటి అంతర్గత సామర్థ్య అంశాలతో అవి వ్యక్తమవుతూ వుంటాయి. ప్రకృతి, పురుష పదబంధాలు యీ త్రిగుణచోదితమై కారణం అవుతున్నాయి. మిగిలిన దర్శనాల్లో మీమాంస హైందవ చింతనని యెక్కువ ప్రభావితం చేసింది. ఈ మీమాంసనే పూర్వమీమాంస అంటారు. మీమాంస కూడా వేదాల్ని అంగీకరించే ఆస్తిక దృక్పథందే అయినా, నిరీశ్వరం. పూర్వమీమాంస కర్మ ప్రధానం అయింది. వైదిక కర్మలని అనుకరించడమే సర్వమూ అని. వేదం మౌలికంగా కర్మకాండల్ని నిర్దేశించేది అని యీ దర్శనం చెపుతుంది. బ్రాహ్మణాలకు, కర్మకాండలకు యీ దర్శనం పెద్దపీట వేస్తుంది. కర్మమీమాంస అని వ్యవహారం రావడానికి యిది హేతువు అయివుంటుంది. జైమిని మీమాంస సూత్రాలు యీ దర్శనానికి ఆధారం. కాలం యెప్పటిదో అనిర్ధారితం. "పూర్వమీమాంసకులకు కావలసినవి రెండు: యజ్ఞములు, బ్రాహ్మణపూజ. వేదములకు మించిన 'సత్తు' వుండకూడదని కాబోలు - వారు దేవుడుకూడ లేడు, వేదములు శాశ్వతములు, వేదములే సర్వమని సిద్ధాంతీకరించిరి." (వ్యాసమంజరి కట్టమంచి రామలింగారెడ్డి.) పూర్వమీమాంసకులు కర్మ అన్నిటినీ మించింది అని చెప్పడానికి చక్కని ఉదాహరణ యిది:

*బ్రహ్మయేన కులాలవన్నియమితో*
*బ్రహ్మాండ భాండోదరే*
*విష్ణుర్యేన దశావతార గహనే*
*క్షిప్తోమహాసంకటే*
*రుద్రోయేన కపాలపాణి పుటకే*
*భిక్షాటనం సేవతే*
*సూర్యోభ్రామతి యేన ఖేనవరతం*
*తస్మైనమః కర్మణే*

"సర్వకారణాలకు కారణభూతం కర్మే"

అని వాళ్ళ ప్రార్థన. ఏ కర్మచేత బ్రహ్మ యీ జగత్తుల "నిర్మాణమునందు కుంభకారునిలా నియుక్తుడైవున్నాడో," దేనిచేత విష్ణువు మహా సంకటకారణమైనట్టి దశావతారాలనే అరణ్యంలో పడాల్సివచ్చిందో, దేనిచేత రుద్రుడు కపాలం పట్టుకుని భిక్షాటనం చేస్తూవుండాల్సివచ్చిందో, దేనివల్ల వినీలాకాశంలో సూర్యుడు సర్వదా పరిభ్రమిస్తూ వున్నాడో అలాంటి కర్మకు నా నమస్కారం అని అర్థం. సర్వకారణాలకూ కారణభూతం అయింది కర్మే అనే పూర్వమీమాంసకుల వాదాన్ని అనుసరించి వున్నది యిది. సకలదేవతలూ కర్మకు లోబడివున్నవాళ్ళేనని వీళ్ళ వాదం. ప్రయోగశాలలో ప్రయోగాలు చేస్తే యోలాంటి ఫలితాలు వస్తాయో అలానే కర్మకాండలు నిర్వహించడంవల్లా వస్తాయి అని. ఫలానా విధంగా కర్మకాండలు నిర్వహించాలని వేదవిహితమై వుంది. అలా చేసినపుడు విధాయకంగా ఆ ఫలితం రావాల్సిందే. అందుకనే దేవుళ్ళని నిలదీయడం కూడా పురాణాల్లో కనిపిస్తూ వుంటుంది. కర్మకాండల శక్తి అంతటిదని విశ్వాసం. అయితే కుమారిలుడు యీ వాదాన్ని ఈశ్వరవాదంవేపు మళ్ళించేడు. కుమారిలుడి శ్లోక వార్తికం ప్రముఖమైంది. మొత్తంమీద చెప్పుకోవాల్సింది పూర్వమీమాంసకులు వేదాధికారాన్ని స్థాపించడం అన్న విషయం. ఈ దర్శనంలో జ్ఞానం స్వయం ప్రమాణం. వేదం ఆ రకంగా స్వయంప్రమాణం. శబ్దప్రమాణం.

## ఉత్తరమీమాంస : వేదాంతతత్వం

ఇక ఉత్తరమీమాంస హైందవచింతనా ధోరణిని ముఖ్యంగా ప్రభావితం చేసిన మరో దర్శనం. దీన్నే వేదాంత తత్వం అనీ అంటారు. వేదాలకు అంతంలో, ఆఖర్న వచ్చినది. ఈ పదబంధం సరైనదేనని అంటున్నారు. ఏమంటే, పూర్వమీమాంసకుల మాదిరే వేద ప్రామాణ్యాన్నే పరమావధిగా పరిగణించకుండా, ఉపనిషత్తుల ప్రాముఖ్యాన్ని యీ దర్శనం చాటుతుంది. వేదాంత దర్శన శాఖకి మూలం బాదరాయణుడి బ్రహ్మసూత్రాలు. సుమారు రెండు వేల యేళ్ళనాడే వీటిని కూర్చడం జరిగింది. కారికల్లా వుండబట్టి అనేక వ్యాఖ్యలు, వివరణలూ వచ్చేయి. ఆదిశంకరులు వీటికి భాష్యం రాశారు. ఆయనే బ్రహ్మసూత్రాలకీ,

ముఖ్యమైన ఉపనిషత్తులకీ, భగవద్గీతకీ వ్యాఖ్యానాలు రాశారు. ఈ లోకం, యివేవీ సత్యం కాదు. మాయ. అసలు సత్తు బ్రహ్మ. సత్ చిత్ ఆనంద విశేషణలు బ్రహ్మకు వున్నాయి. బ్రహ్మ నిత్యం, మార్పు లేనిది. మిగిలినవి మార్పు చెందుతూ వుంటాయి. విడిగా వ్యక్తుల విషయం వచ్చేటప్పటికి "సంసారం"లో వెల్లడవుతూ వుంటాయి.

బ్రహ్మసత్యం జగన్మిధ్యా జీవోబ్రహ్మైవనాఽపరః
ఆత్మనస్తత్వ విజ్ఞానాత్తత్వం బ్రహ్మైవకేవలః

## ప్రస్థానత్రయం

బ్రహ్మ యొక్కటే సత్యం, జగత్తు మిధ్య. జీవుడు బ్రహ్మమే కాని వేరొకటి కాదు. ఆత్మతత్వం తెలుసుకోవడం ద్వారా తానే బ్రహ్మ అని రూఢి చేసుకొంటున్నాడు అని దీని భావం. ఈ జీవుడు బ్రహ్మను తెలుసుకోవడమే మోక్షం. అంతదాకా జనన మరణ సంసారచక్రంలో తిరుగుతూనే వుంటాడు. "శరీర నివాసి యగు జీవునితత్త్వ మావిష్కరించటంచేసి యిది శారీరక మీమాసం అయినది" (మల్లాది సూర్యనారాయణశాస్త్రి : సంస్కృత వాఙ్మయం. లౌకిక వాఙ్మయం). ఉపనిషత్తుల ఆధారంగా బాదరాయణుడు బ్రహ్మసూత్రాలు రాశారు. వాటికి వ్యాఖ్యానంచేసి ఆదిశంకరులు యీనాడు హిందూమతం అని భావించే జీవిత విధానానికి ఒక వ్యవస్థను యేర్పాటుచేశారు. అందుకనే ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలు ప్రస్థానత్రయంగా ప్రసిద్ధి కెక్కాయి. ప్రస్థానం అంటే ఉపదేశోపాయం, దర్శనాన్ని బోధించే శాస్త్రం అని అర్థం.

ఈ ప్రస్థానత్రయంలో వేదాలు లేకపోవడం, ఉపనిషత్తులతోబాటు భగవద్గీత స్థానం పొందడం పరిశీలించాలి. వేదాలే మూలం కాబట్టి అవి వుండక్కర్లేదు అన్న వాదం ఒప్పుకున్నా, ఉపనిషత్తులు వైదికమైనదానికి, యజ్ఞయాగాది కర్మకాండలకు వేసిన పెద్దపీటను తీసేసిన విషయం ఉపేక్షించరానిదే.

ఉపనిషత్తులు వేదకర్మకాండకి భిన్నమైన దృక్పథాన్ని ప్రకటిస్తున్నాయి, కొన్ని సందర్భాల్లో వాటికి విరుద్ధమైన దృక్పథాన్ని కూడా

ప్రకటిస్తున్నట్టే. ముండకోపనిషత్తులో (ప్రథమ ముండకం, ద్వితీయ ముండకం, 7) యిది పైకే తెలుస్తూ వుంది.

ప్లవాహ్యేతే అదృఢాయజ్ఞరూపా
అష్టాదశోక్త మవరం యేషుకర్మ
ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా
ది రామృత్యుంతే పునరేవాపి యంతి

## యజ్ఞకర్మలపై మీమాంస

గౌణమైన కర్మ (జ్ఞానరహితమైంది). గౌణం అంటే అప్రధానం. జీవచరితం. పద్దెనిమిది అంగాలతో కూడిన యజ్ఞకర్మలపైన ఆధారపడి వుంటుంది. అవన్నీ కూడా నిజానికి దుర్బలమైన తెప్పలవంటివే. ఇదే జీవిత పరమార్థమనుకుని కొనియాడే మూర్ఖులు నిస్సంశయంగా మళ్ళీ మళ్ళీ జరామృత్యు చక్రంలో పడి తిరుగుతూ వుంటారు. అంటే మోక్షప్రాప్తికి యజ్ఞవిధులు బొత్తిగా నిరుపయోగం అని యిందులో సూచన వుంది. (ముండకోపనిషత్తు, ఆంగ్లమూలం శ్రీశర్వానందస్వామి. శ్రీరామకృష్ణమఠం, మద్రాసు, పేజీ 24.) పద్దెనిమిది అంగాలు అంటే పదహారు మంది యత్విజులు, యజమాని, భార్య. యజ్ఞ నిర్వహణకు యీ పద్దెనిమిదిమందీ అవసరం. అందుకనే "అష్టాదశోక్త మవరం యేషుకర్మ" అనడం. అలా అని ఉపనిషత్తు మొత్తం యజ్ఞకర్మకాండని మార్చబోతోందని కాదు. మోక్షప్రాప్తికి అవి బొత్తిగా నిరుపయోగాలని మాత్రమే చెప్పదలచుకున్న విషయం. ఆరణ్యకాలలో యీ వైరుధ్యం కర్మకాండలని శబ్దతః కాకుండా రూపకాలంకారంగా వివరించడం కనిపిస్తుందంటారు. అశ్వమేధయాగాన్ని బృహదారణ్యకోపనిషత్తు ధ్యానంగా వ్యాఖ్యానిస్తుంది అని రాశారు. (హిరియణ్ణ: ఔట్‌లైన్స్ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ, పే. 48.) ఆరకంగా అసలు అశ్వమేధ కర్మకాండవల్ల లభించే సర్వాధిపత్యం సిద్ధిస్తుందిట. ఆలంకారికంగా తమకు నచ్చిన అర్థాన్ని అందుబాటులో వున్న గ్రంథాలనుంచి గ్రహించడం భారతదేశంలో మామూలే. యజ్ఞయాగాల పశు హననాన్ని సహించలేని పండితులు ప్రత్నామ్నాయంగా వేరే విధంగా ఆ కర్మకాండని జరిపించడం కొత్తయేమీ కాదు. "యజ్ఞానుష్ఠానమునందు

హింస ఉన్నది కనుక శ్రీరామానుజులు రద్దుచేసినారనియు, మధ్వాచార్యుల వారు వాస్తవమైన పశువును రద్దుచేసి ఆ స్థానమున పిండితో చేసిన పశువును ప్రవేశపెట్టినారనియు కొందరు చెప్పుచున్నారు. ఇక స్వామి దయానంద సరస్వతి, శ్రీపద దామోదర సాత్వలేకర్ మొదలుగు నవీన పండితులు వేదమున యజ్ఞపశువులుగా చెప్పబడిన గో, అజ, అశ్వ, నర మొదలగు పదములకు ప్రసిద్ధమైన అర్థమును మార్చి, ఆయా పదములు ఆయా ఓషధులను బోధించుచున్నవని వ్యాఖ్యానము చేసినారనియు వారు చెప్పుచున్నారు.

## పశుహింస వేదవిహితమా?

"శాస్త్రీయ విషయములను శాస్త్రీయ మార్గముననే పరిశీలించవలెను. కాని లౌకికదృష్టితో పరిశీలించుట యుక్తము కాదనుకొందును. "మా హింస్యా త్సర్వాభూతాని" అని వేదము బోధించుచున్నది. అనగా సర్వప్రాణులను (ఏ ఒక్క ప్రాణిని కూడా) హింసించరాదని ఈ శ్రుతి వాక్యమున కర్థము. నిత్య కామ్య కర్మలైన సోమయాగాదులందు పశ్వాలంభము ఆ వేదమే విధించుచున్నది." బ్రాహ్మణులకు భోజనము పెట్టుము" "వసిష్ఠునకు భోజనము పెట్టవలదు" అనునవి రెండు వాక్యములు. మొదటి విధి వాక్యమువలన బ్రాహ్మణుడైన వసిష్ఠునకు భోజనము ప్రాప్తమగుచున్నది. రెండవ వాక్యమువలన భోజనము నిషేధించబడుతున్నది. మొదటిది సామాన్య వాక్యము. రెండవది విశేష వాక్యము. సామాన్య వాక్యముకంటె (విధికంటె) విశేష విధి బలవత్తరమని శాస్త్రీయ సిద్ధాంతము. ఏ ఒక విధియు వ్యర్థము కారాదు. అందువలన వసిష్ఠేతరులైన బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. వసిష్ఠునకు మాత్రము భోజనము పెట్టవలదని సమన్వయించుటవలన రెండు విధులును సార్థకములగుచున్నవి. ఆ విధముగానే పశువులను హింసించరాదన్నది సామాన్య విధి. సోమయాగమునందు పశ్వాలంభనము చేయవలెననునది విశేష విధి. కనుక యాగేతర సన్నివేశములందలి ప్రాణిహింస దోషావహము. యజ్ఞము నందలి ప్రాణిహింస దోషావహము కాదని సమన్వయము చేయవలెను. దీనివలన యజ్ఞములందు యదార్థ పశువునే ఆలంభము చేయవలెనని స్పష్టమగుచున్నది... "పశూపాకరణా

దికమునందు యజమానుడు అగ్న్యాది దేవతలను ప్రార్థించిన విధమును పరిశీలించినచో దేవతల తృప్తికై చేయునట్టి హింస లోకసాధారణమైన హింసవంటిది కాదని అర్థమగును....''

(కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత, వేదార్థదీపికారహితము. తృతీయ కాండము. తృతీయ సంపుటము. వ్యాఖ్యానకర్త శిరోమణి, భాషాప్రవీణ, తర్కవ్యాకరణ పూర్వోత్తర మీమాంసా విశారద శ్రీరామవరపు కృష్ణమూర్తి శాస్త్రి, ప్రచురణ తిరుమల తిరుపతి దేవస్థానములు. తిరుపతి. 1989, "ఆముఖము" V,VI)

ఈ ఉల్లేఖనను యింత దీర్ఘంగా తీసుకురావడంలో యిక్కడ ఉద్దేశం ఉన్న విషయాన్ని ఆలంకారికంగా అనుకూలంగా వ్యాఖ్యానించడం సంప్రదాయంలోనే వుంది అని తెలియచెప్పడానికి. పశ్వాలంభం చెయ్యవచ్చునా లేదా అన్న విషయంలో ఇలాంటి విభేదాలు తలెత్తి వ్యాఖ్యానాలు వచ్చేయి కదా, అలాంటప్పుడు ఆనాడు బృహదారణ్యకంలో అశ్వమేధయాగాన్ని తపస్సు, ధ్యానంగా రూపక అలంకారంగా భావించి వ్యాఖ్యానించడంలో వింతలేదు. ఇక్కడ మరో విశేషాన్ని ప్రస్తావించాలి. శ్రీ రామానుజులవారు పశుహింస నిషేధం చేశారని, ఆరకంగా యజ్ఞకర్మ కాండని తప్పించారనీ కదా అంటున్నారు. అయితే వైష్ణవులలో వళహ, తెళహ అని శాఖలు వున్నాయి. దీన్నే వడహల, తెంగళ అని అంటూ వుంటారు. "వళహవారు వేదానికి స్మార్తులిచ్చినంత గౌరవాన్ని యిస్తారు. యజ్ఞ యాగాదులు పిష్టపశువుతో కాకుండా ప్రత్యక్ష పశువుతోనే చేస్తారు. స్త్రీలకు శిరోముండనం. తెళహవారికి యీ రెండూ లేవు. భక్తికే ప్రాధాన్యం" అని చెళ్ళపిళ్ళవారు కథలు-గాథలులో రాశారు. అంటే, అటు తిరిగి యిటు తిరిగి వేదప్రమాణం మళ్ళీ దూసుకువచ్చినట్టేకదా!

అదేరకంగా ముండకోపనిషత్తులో యజ్ఞ విధులను, పైన ఉల్లేఖించిన ముండకంలో నిరుపయోగాలని చెప్పినా క్రమేపీ ఆ వైరుధ్యం సాఫీ అయింది, ఉపనిషత్తుల సిద్ధాంతం నిలదొక్కుకోగానే వైరుధ్యం లేకుండా సమసింపచేసే ప్రయత్నం జరిగింది. "శ్వేతాశ్వతర ఉపనిషత్తు"లో యిది కనిపిస్తుంది.

## జ్ఞాన, కర్మ, రాజయోగాల సమన్వయం

అగ్నిర్యత్రాభి మధ్యతే వాయుర్య త్రాధిరుధ్యతే
సోమో యత్రాతి రిచ్యతే తత్రసంజాయతే నమః
సవిత్రా ప్రసవేన జుషేత బ్రహ్మ పూర్వమ్
యత్ర మోనిం కృణవసేనహితే పూర్తమక్షివత్
(శ్వేతాశ్వరోపనిషత్తు, ద్వితీయాధ్యాయం 6, 7)

"అగ్ని ఎక్కడ మధించబడుతున్నదో, గాలి ఎక్కడ నిరోధించ బడుతున్నదో, సోమరసం ఎక్కడ పొరలిపోతున్నదో అక్కడ మనస్సు పరిపూర్ణతను పొందుతుంది.

"దేనినుంచి నువ్వు జన్మస్థానాన్ని నిర్మూలించగలవో, గతించిన కర్మఫలంచేత బాధించబడవో అట్టి సనాతన బ్రాహ్మముపట్ల నీవు ఆదికారణమైన అంతర్యాలద్వారా తత్పరుడవై యుందువుగాక!

పై ఉపనిషత్ మంత్రాలు రెండూ సమన్వయానికి నడిపిస్తున్నాయి. మొదటిది "జ్ఞాన, కర్మ, రాజయోగాల సమన్వయాన్ని ఉద్దేశించి అన్నిటినీ పరతత్త్వ సాక్షాత్కారానికై ఉపయోగిస్తున్నది. రెండవది భక్తియోగాన్ని సూచిస్తూ ముందటి మంత్రంలో చెప్పిన యోగసమన్వయాన్ని పూర్తి చేస్తున్నది" అని యీ ఉపనిషత్ వ్యాఖ్య రాసిన శ్రీ త్యాగీశానందస్వామి వివరించారు.

ఈ రకంగా వేదాలమీద, ఆ కర్మకాండలమీద వ్యతిరేకత లేదా నిరసన వెల్లడైన సందర్భాల్లో మొదట కొంత తీవ్రత కనిపించినా తరవాత "సర్దుబాటు" జరిగి, మళ్ళీ వేదాలు పరమ ప్రమాణం అన్న పల్లవి అందివచ్చేది. వేదంలో అసలు యేం వుందో ప్రశ్నించకుండానే, తర్కించకుండానే దాన్ని పరమ ప్రమాణం చేసే ప్రయత్నాలు అలా అనూచానంగా వుంటూనే వున్నాయి. సమన్వయం చేసే ప్రయత్నాలు అలా కొనసాగుతూనే వచ్చేయి.

"వేదము ధర్మమూలమని పూజ్యులన్న మాట వాస్తవము. అట్లని సాంఘికములైన సకల ధర్మములను వేదములు సాంగోపాంగముగా విశదీకరించినవనుకోరాదు. తరువాత వెలసిన సూత్ర స్మృతీతిహాస

పురాణములు గావించిన వివిధ ధర్మపరిష్కారములకు వానిగుందలి చిన్న చిన్న యితిహాసములును, బహువిధములైన సంవాదములును, ధర్మసూచనలును ప్రధానాధారము గావున సర్వమునకు వేదమే ప్రమాణ మని శాస్త్రకర్తలు వక్కాణించియున్నారు" అని మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు రాశారు. (లౌకిక వాఙ్మయం.)

## వేదాల్లో కనుపించని విశేషాలు

అంటే ఏమిటన్నమాట? వేదాలు ధర్మానికి మూలం. అలా అని అన్నీ అందులో వున్నాయనుకోకూడదు. తరవాత తరవాత వచ్చిన స్మృతులు, పురాణాలు, ఇతిహాసాలు ధర్మపరిష్కారం చేశాయి. అయితే అన్నిటికీ ప్రధానాధారం వేదమని చెప్పి వేదాన్ని ప్రమాణం చేశారు.

ఇది చాలా చిత్రమైన విషయం. ఏమంటే, వేదంలో లేని అనేక రూపాల్లో, ఆ పేరుమీద జీవితంలో అనేకం అమలు అవుతున్నాయి. ఉదాహరణకి యివాళ జనం అనుసరించే అనేక ఆచారాలు, పూజలు, దేవుళ్ళు వేదంలో కనిపించడమేలేదు.

ఉదాహరణకు వేదాల్లో యజ్ఞం, హోమాలు వున్నాయి. ఇవాళ యెంతో ప్రాచుర్యంగా వున్న పూజావిధానం లేదు. పువ్వులు, పత్రి, జలం అర్పించి పూజ చెయ్యడం యివాళ యీ మతదృక్పథంవాళ్ళకి ముఖ్యంగా వున్నాయి. (The Dravidian ritual of worship by means of flowers and leaves and water has survived as the most ... from of Hindu ritual in worship. The puja, as opposed to the ritual of the burnt offering of the Aryans - the homa. The deeper elements in Hindu thought and religion were largely the contribution of the Dravidian speakers." Suniti Kumar Chattarji "Interrelations of cultures.")

## వేదాల్లో విగ్రహారాధన ఉన్నదా?

ఇక దేవతారాధన విషయానికి వస్తే వేదాలలో లేనిది, హిందూమతం అని అవలంబించేదాంట్లో ప్రాచుర్యంగా వున్నది విగ్రహారాధన. వేదాలలో వున్న వరుణ, మిత్ర, ఇంద్ర వంటి దేవుళ్ళెవరూ యివాళ ఆరాధనలో లేరు. సింధునాగరికతవాళ్ళ మతదృక్పథం, విగ్రహారాధనతోనూ శివ,

మాతృదేవతల ఆరాధనతోనూ వున్న హిందూమత పార్శ్వం నుంచి విడదియ్యలేనిదిగా వుంది. శివారాధన, మాతృదేవతారాధన వైదిక మతానికి స్వతహాగా లేవు. ("The religion of the Indus people is hardly distringishable, according to Sir John Marshal, from `that aspect of Hinduism which is bound up with animism and cults of Siva and the Mother goddess'. These latter also not seem to be indigenous to the Vedic religion." "Hinduism" by S. Radha Krishna.) అంతేకాదు, శక్తి ఆరాధనను తర్వాత వైదిక మతానుయాయులు అంగీకరించినా మొదట్లో వున్న వ్యతిరేకత మొత్తంమీద పోలేదు. దక్ష యజ్ఞానికి శివుణ్ణి తప్ప మిగిలిన దేవతలనందర్ని పిలవడం వుందికాదా! భాగవతపురాణం నాటికి కూడా శివారాధనకు వ్యతిరేకత వుంది. "శివుణ్ణి ఆరాధించేవాళ్ళు, అనుసరించేవాళ్ళు పవిత్రగ్రంథాలకు వ్యతిరేకులు, పాషండులతో సమానం" అని తిరస్కారంగా చూడడం వుంది. "పద్మపురాణం"లో పాషండులంటే పుర్రెలు ధరించేవాళ్ళనీ, విభూతి పూసుకునేవాళ్ళనీ, శల్యాలు వేసుకునేవాళ్ళనీ వుంది. వాళ్ళకేశాలు అట్టకట్టి వుంటాయి. వేదాలు అంగీకరించని క్రతువులలో వుండేవాళ్ళని ఆ పురాణం చెప్పింది. పుర్రెలూ, బూడిదా వైదిక చిహ్నాలుకావు. (యీ విషయాలన్నీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు యీ వ్యాసంలో చెప్పినవే.) చివరకు యీ శివుడే వైదిక రుద్రుడికి అనుసంధానమై రుద్ర, శివ ఏకత వచ్చింది. రుద్ర నమకంతో యివాళ అర్చనలు జరుగుతూ వున్నాయి. ఇదే మాదిరీ విష్ణువుకి సంబంధించినీ. వేదాలలో విష్ణువు వున్నాడు. ఋగ్వేదంలో ఓ తక్కువ తరగతి దేవుడుగానే వున్నాడు. లేదా యితర దేవుళ్ళతో సమంగా వున్నాడు తప్పిస్తే ఆధిపత్యం కలవానిగా లేడు. (``Vishnu is an old Vedic god and appears in the Rigveda as a minor deity or at least only on a footing of equality with the others." (Hiriyanna; Outlines of Indian Philosophy.) Vishnu "Gradually supersedes the other Gods and becomes supreme." (యిదే గ్రంథం).

## త్రిమూర్తులు ఎప్పుడు పుట్టారు?
## వేదంలో గణపతి దేవుడున్నాడా?

నారాయణుడు అన్న భావన ఆ తరవాత క్రమేపీ రూపొందింది. నారాయణుడనే పదానికి ప్రవహించే జలాలపై నిద్రించేవాడని వ్యుత్పత్తి అర్థం చెప్పుకోవచ్చని కోశాంబి అన్నాడు. నారా+ఆయణుడు= నీరే ఇల్లుగా కలవాడు. అయితే 'నారాయణ' అంటే నర - మూలరూప పురుష - నుంచి అవతరించినవాడని అర్థం కూడా వుందని అంటారు. అవతారాలలో నరరూపం ధరించిన వాడవడం వల్ల ఆ పేరు వచ్చిందని మరో వివరణ వుంది. "ఉదకములు స్థానముగా కలవాడు" అని మహాభారతంలో కూడా వుంది. వ్యుత్పత్తి అర్థాలు యేమాదిరిగా వున్నా నీటితో సంబంధం కలిగి ఏకరూప దేవుడవడం వేదకాలానికి చాలా తరవాత జరిగింది. ఇలా వేదంలోలేని శివ, నారాయణులు రుద్ర, విష్ణువులతో కలిసి హైందవ దేవతామూర్తుల్లో అగ్రాసనం మీద కూర్చుని భిన్న 'మతాలకి' అధిపతులై హిందూమతంలో భాగంగా వున్నారు. ఇక విఘ్నేశ్వరుడు, గణేశుడు, గణపతి అని అట్టహాసంగా నవరాత్రి ఉత్సవాలు జరిపించి, "నిమజ్జన" కార్యక్రమం సజావుగా సాగడానికి ప్రభుత్వ యంత్రాంగం నడుం బిగించి, పూర్తయేక "హమ్మయ్య" అని ఊపిరి పీల్చుకునేటట్టుచేసే యీ దేవుడు వేదంలో లేనేలేడు. పూజా కార్యక్రమంలో మొదట విఘ్నేశ్వరుణ్ణే ఆరాధిస్తూ వున్నారు. దానికి వేదంలో వున్న మంత్రాన్ని కూడా ఆవాహన చేస్తున్నారు. అసలా మంత్రంలో యిలా కొలిచే యీ దేవుడు శివపార్వతుల తనయుడిగా పూజలందుకుంటున్నాడు. అసలు మొదట్లో పార్వతి కొడుకుగానే తప్ప శివుని పైతృకత్వం వున్నట్టు లేదంటారు. మహాయాన బౌద్ధమతంలో ప్రవేశించిన దేవుళ్ళలో గణేశుడు వున్నాడు. మిగిలిన దేవుళ్ళతోబాటు యీ దేవుడు బుద్ధునికి కొలువుచేసినట్టు జాతకకథల్లో చెప్తారు. వేదంలో వున్న మంత్రాన్ని వినాయకచవితి పూజలో మొదట చదువుతారు. అది యిదీ:

*గణానాం త్వా గణపతిం హవామహేకవింకవీనా*
*ముపమశ్రవస్తమమ్*
*జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పద ఆనఃశృణ్వ*
*న్నూతిభిః సీదసాదనమ్*

ఇది ఋగ్వేదం ద్వితీయ మండలం, 3వ అనువాకం, 23వ సూక్తంలో మొదటి రుక్కు. దీనికి నేమాని వేంకట నరసింహశాస్త్రిగారి పద్యానువాదం:

గీ॥ గణములకు నెల్లఁ బతివట గణపతివని, కవి
సమూహంబులోపలఁ గవివరుండ
వౌదువని యెంచి నీయన్న మధిగమింతు
బ్రహ్మణస్పతి నీవెంతవాడవయ్య!

(సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత, ప్రథమ సంపుటము, ప్రచురణ తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి, పేజీ 739, 744)

ఇక్కడ దేవత బ్రహ్మణస్పతి, ఈ బ్రహ్మణస్పతి, అందరికీ మరింత యెక్కువగా పరిచితం అయిన బృహస్పతి ఒకరేనని కొంద రంటారు. కాని అది కాదని వివరణలో యిచ్చేరు. ఏమైనా, విస్తృత ప్రచారం పొందిన గజాననుడు - ఏనుగు తలవున్న గణేశుడు - బ్రహ్మణస్పతి ఒకరు కాదు అనీ గజముఖుడైన దేవుడు వేదకాలం తర్వాత హిందూ ఆరాధనల్లో ప్రవేశించాడనీ చెప్పుకోవచ్చు.

ఇంత వివరంగా యీ విషయాలన్నీ చెప్పడం యెందుకు అనవచ్చు. వైదిక ధర్మంగా భాసించేది, యివాళ హిందూమతం అనే పేరుమీద ప్రకృతంలో వున్నది యెంతవరకు వేదాల్లో వుందీ అని తెలుసుకోవడానికే.

మరి వేదప్రోక్తమైనవికాని అంశాలన్నీ యెలా ప్రవేశించాయి? అలా వచ్చి చేరినవీ, వేదప్రోక్తమైనవీ ఒక పేరుతో వ్యవహారంలోకి యెలా వచ్చాయి? ఆ పేరు ఏమిటి? అదెప్పుడు వచ్చింది? మరి అంతకుముందు దాన్ని యేమని వ్యవహరించేవారు? అనే విషయాలు తెలుసుకుంటేనేగాని యివాళ యీ దేశంలో సాగుతూవున్న జీవిత విధాన దార్శనికతని బోధపరచుకోలేం.

## వేదాల్లో విగ్రహారాధన లేదు - నేటి దేవుళ్ళు అసలే లేరు!

వేదాల్లో పూజలేదు, విగ్రహారాధనలేదు. వేదకాలం దేవతలైన ఇంద్ర, వరుణ, మిత్రాదులందరూ aniconic. అంటే మనుషుల ఆకారంలో

లేదా జంతువుల ఆకారంలో మలచని, రూపుతీసుకోనివాళ్ళు. పోనీ, వాళ్ళు తర్వాత అర్థంలో దేవుడు భావనకు తూగరని వివరించుకున్నా అసలు సృష్టికర్త ఈశ్వరుడు అనే భావనకు రూపం లేదు. (మోజెస్ దేవుడి వాణి విన్నాడు కాని రూపం చూడలేదు. అలా భావనకు ఆకారం లేదు.) కాని వేదకాలం తర్వాత ఓ రూపంలో శివ, నారాయణాది దేవతల్ని ఆరాధించడం వచ్చింది. వేదంలో గుళ్ళు లేవు. అసలు శక్తిరూప స్త్రీ ఆరాధనే లేదు. తంత్రవిద్య లేదు. అధర్వణవేదంలో యిందుకు సంబంధించిన మంత్ర తంత్ర విశేషాంశాలు వున్నా దానికి ప్రమాణస్థాయి లేదు. అసలు వేదాలు మూడేనని నాలుగోదిగా అధర్వణవేదం చేరిందనీ అంటారు. ఆదిశంకరులు కూడా "త్రయీవేద్యం హృద్యం" అనే ప్రతిపాదించారు. "శాక్తమతంలోని ఒక్క మంత్రమూ వేదంలో లేదు" అని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారే రాశారు. ఇక గుళ్ళు గోపురాలు, విగ్రహాలు ప్రతిష్ఠలు అన్నీ వైదికేతరమైన ఆగమ విధానంలో జరుగుతున్నాయి. "యంత్రములు, విగ్రహములు ధ్వజస్తంభములు తత్ప్రతిష్ఠలు మొదలగునవన్నియు నాగమోక్తమ విధానముననే జరుగుచున్నవి" అని వారు రాశారు. అయితే యీ విధానం వైదిక విధాన సన్నిహితం అయింది. వేదోక్తమంత్రాల కలయికతో దేవాలయాల్లో ఆచరణలో వుంది. ఇలా వైదిక, వైదికేతర అంశాలు కలిసినదే యివాళ భారతదేశంలో వున్న మతం. ఈ మతాన్ని హిందూమతం అని వ్యవహారంలో చెబుతున్నారు.

## "హిందూ" అన్న పదం ప్రాచీన సాహిత్యంలో ఉన్నదా?

'హిందూ' అనే పదమే ప్రాచీన సాహిత్యంలో లేదు. ఈ మాటను మొదటగా క్రీ.శ. 8వ శతాబ్దంనాటి ఓ తాంత్రిక గ్రంథం ప్రస్తావించింది అంటారు. అయితే యీ పదం 'అవెస్తా'లోనూ, ప్రాచీన పర్షియన్‌లోనూ అంతకుముందే వుంది. భారతదేశాన్ని గురించి ప్రస్తావించడానికి పాశ్చాత్య, మధ్య ఆసియాదేశాలలో యీ పదాన్ని వాడేవారు. ఈ దేశంలో నివసించే ప్రజలకి వర్తించేటట్లు యీ పదాన్ని వాడేవారు. సింధునది పేరుమీద యిలా హిందు అని వాడడం వచ్చింది. ఈ దేశాన్ని హిందూదేశం అని పిలవడం వచ్చింది. క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన చైనా యాత్రీకుడు ఇత్సింగ్ యీ దేశాన్ని మధ్య ఆసియావాళ్ళు హిందూ అంటున్నారనీ, (Hsin-th)

కాని అది సరికాదనీ, సరైన పేరు ఆర్యదేశం అనీ రాశాడు. ఒక ప్రత్యేక మతంతో హిందూపదానికి సంబంధం కలిగించడం చాలా తర్వాత కాలానిదని నెహ్రూగారు రాశారు. హిందూ, హిందూస్తాన్, హిందూమతం అని యీ భౌగోళికప్రాంతానికి, ప్రజలకి, జీవిత దృక్పథానికి పేరు ముస్లిమ్‌ల రాకతో, అరబ్ భాషా ఉచ్చారణ మర్యాదల ననుసరించి 'సింధు' పదం పొందిన మార్పుద్వారా వచ్చింది. (ఇవాళ హిందూరాష్ట్రాభిమానులు యిలా వచ్చిన హిందూపదం గొప్పదనం చాటుకోవడం చిత్రం!)

ఇలా పేరు చాలా తర్వాత తర్వాత వచ్చినా, ఆ పేరు రాకముందు యీ జీవిత దృక్పథాన్ని యెలా వ్యవహరించుకునేవారు? ఆర్యధర్మం అని పిలుచుకునేవారు. ఆ ప్రదేశాన్ని ఆర్యావర్తం అని వర్తించేవారు. ఆర్యావర్తం చాలా పవిత్రభూమి అని పరిగణించేవారు. ఈ ఆర్యధర్మానికి వేదాలు మూలస్థానంలో వున్నా, అనేక యితర దృక్పథాలు మిళితమై ఆర్య, ఆర్యేతర విశ్వాసాలు కలిసి దీన్ని పెంచి పోషించాయి. ఆర్య, ఆర్యేతర విశ్వాసాలు కలిసి రూపొందిన యీ దేశ జీవిత విధానానికి యే ఒక్క ప్రవక్తా, యే ప్రత్యేక మతగ్రంథమూ పరమ ప్రామాణిక స్థాయిలో లేవు. ఆర్యధర్మం అనేదాన్ని వేదాలని విశ్వసించే ఆస్తికులతోబాటు, బౌద్ధ జైన దృక్పథాలవాళ్ళు వ్యవహరించేవారు. బుద్ధుడు మోక్షానికి తన పద్ధతిని "ఆర్యపథం'' అనే వ్యవహరించాడు. ఆర్యవిధానాన్ని, వేదాధికారాన్ని మన్నించేవాళ్ళు దీన్ని సనాతనధర్మం అన్నారు. దీన్ని బ్రాహ్మణమతం అనీ వ్యవహరిస్తారు. ఈ సనాతనధర్మంలో బౌద్ధ జైన విశ్వాసాలూ కలిశాయి. అయితే రాను రాను హిందువుల్లో సంప్రదాయానుయాయులు అనుకునేవాళ్ళు ఆ పదబంధాన్ని గుత్తకొన్నారు. ఈ సనాతనధర్మ జీవిత విధానానికి హిందూ అని తర్వాత పేరు వచ్చినా, కచ్చితంగా యేది హిందూ అన్నది చేతికి అందకుండా పోతూనేవుంది. మతం అని సామాన్యంగా అర్థం చేసుకునే నిర్వచనాలకు అందకుండానే పోతూవుంది. ఒక ప్రవక్తగాని, ఒక నిర్దిష్ట మతగ్రంథంగాని, మతంలోకి మార్పిడికాని లేవు. మరి హిందూ అని అనుకొనే యీ సనాతన వైదిక ధర్మం విశ్వసించడం యెలాగ? "ఒక విశ్వాసంగా హిందూమతం అస్పష్టం, ప్రత్యేకంగా వ్యవస్థితం కాదు. బహుముఖం. అందరికీ అన్నీనీ. దీన్ని నిర్వచించడం కష్టం. అసలు యిది ఒక మతమా కాదా అని చెప్పడం, ఆ పదానికి

వున్న మామూలు అర్థంలో, కుదురదు" అని నెహ్రూగారు రాశారు. ఈనాడు యిది వున్న రూపంలో, మళ్ళీ చెపితే గతంలో కూడా అనేక ఆచారాల్నీ, నమ్మకాల్నీ యిముడ్చుకుంది. ఇందుకు ఉదాహరణగా వేదప్రోక్తమైనవి యేమిటో, వచ్చి కలిసినవి యేమిటో పైన చూశాం. ఎవరు హిందువు అని చెప్పాల్సివచ్చే సందర్భాలు వుంటాయి. కనీసం న్యాయశాస్త్రరీత్యా అలాంటి సంఘటనలు తలెత్తుతాయి. కేరళ హైకోర్టు 10-4-90న యీ విషయమై ఒక తీర్పు యిచ్చింది. ఆ తీర్పు ప్రకారం దైవచింతన, విగ్రహారాధన వుండడం హిందూ దృక్పథం అవుతుంది. అవి లేకపోతే దేవాలయాల పరిపాలన అస్తవ్యస్తం అవుతుందనీ అందులో అన్నారు. (Who is who among Hindus. V.R. Krishna Iyer - Main Stream, July 7, 1990.) దీన్ని హైకోర్టు నమూనా హిందూమతం అని కృష్ణ అయ్యర్ వ్యాఖ్యానించారు. ఆ లెక్కన చూస్తే కర్మకాండల్ని నిరసించిన వివేకానందులూ, దయానందులూ, అరవిందఘోష్ వంటివాళ్ళెవరూ హిందువులేకారు!

హిందూమతం అనేక దృక్పథాల కలయికవల్ల రూపుతీసుకుని యెదిగింది. బౌద్ధ, జైన, క్రైస్తవ, ఇస్లాం మతాలు వచ్చాయి. వాటికి ఓ ప్రవక్త, వ్యవస్థ లాంటివి వున్నాయి. ఆ మతాల్లోకి యెవళ్ళైనా యిష్టావత్తిగా మారవచ్చు. వాటిని వదిలిపెట్టి కొత్త విశ్వాసాలనీ అందుకోవచ్చు. కాని హిందూమతంలో అలాంటి అవకాశం లేదు. ఏమంటే, హిందూమతంలోని యేదో ఒక కులంలోకి జన్మతః రావడంవల్లే హిందువు అవుతాడు. కులవ్యవస్థ హిందూ జీవిత విధానానికి, ఆ రకంగా యీ మతానికి మూలస్తంభం, మిగతా మతాలకి సంబంధించి మతభ్రష్టత్వం వుంది. హిందూమతంలో అది లేదు. కులచ్యుతి, కులభ్రష్టత్వం వున్నాయి. ఏ కులం ఆచారాలు, ఏ కులం కట్టుబాట్లు ఆ కులానివే.

## కులవ్యవస్థ ఎలా రూపుదిద్దుకుంది?

ఈ కులవ్యవస్థ యెలా రూపుతీసుకుందీ, యెలా స్థిరపడిందీ కచ్చితంగా పండితులు చెప్పలేకపోతున్నారు. ఆర్యులు వర్ణవ్యవస్థని యెరుగుదురు. కులవ్యవస్థ భారతదేశంలోనే హిందూమత విశ్వాసంలో రూపుతీసుకుంది. ఇది యెలా ఏర్పడిందీ అన్నదాన్ని గురించి రకరకాల

అభిప్రాయాలు వున్నాయి. ఆర్య విధానంలోని వర్ణ విభజన సమాజంలో ఆయా విభాగాలవాళ్ళు ఎవళ్ళ విధులు వాళ్ళు సవ్యంగా నిర్వర్తించడంవల్ల సమాజం శ్రేయస్సు పొందుతుందని విశ్వసించారు. వర్ణవ్యవస్థ ఆదర్శప్రాయం. అయితే కులవ్యవస్థ ఘనీభవించి మార్పు అనేదానికి అవకాశం లేకుండా నిలిచిందని యివాళ అంటున్నారు. కులాలు వృత్తుల్నిబట్టి వచ్చాయనీ, విభజన ఆయా విభాగాలవాళ్ళ పరిశుద్ధ రక్తాన్ని కాపాడే ఉద్దేశంతో వున్నదని యీ వ్యవస్థకు కారణాలు చెబుతున్నారు. వర్ణవిభజనలోని నాలుగు వర్ణాలూ ప్రధానంగా అలానే వుంటున్నాయి. కులం మాత్రం అలాకాదు కొత్త కులాలు పుట్టుకొస్తాయి. పాతవి కొన్ని పోవచ్చు కూడా. అయితే వర్ణవ్యవస్థలో పై మూడు ద్విజసంప్రదాయానివి. అంటే యజ్ఞోపవీత అర్హత వున్నవి. నాలుగోదిగా ప్రస్తావించిన దాంట్లో మిగిలిన కులాలు అన్నీ వచ్చి చేరతాయి. ఈ కుల, వర్ణ వ్యవస్థ మార్పులేక స్థిరీకృతమై అలానే నిలబడి వుంది. నిలబెట్టే ప్రయత్నాలూ చేస్తూ వున్నారు. అసలు కుల వ్యవస్థ పోతే వర్ణ సంకరమై పోతుందనీ, అలా జరిగితే యిక ముప్పు తప్పదనీ, దాన్ని నిలబెట్టడమే పరమధర్మం అనీ స్మృతులు, పురాణాలు, ఇతిహాసాలు ఘోషిస్తున్నాయి. కులవ్యవస్థ అంత పట్టుతో యింకా నిలబడేవుంది. వేదకాలంనుంచీ అవిచ్ఛిన్నంగా వస్తూవున్న వారసత్వం యిది. వేదకాలంనాటి దేవుళ్ళు మారారు. ఆరాధనా పద్ధతులు మారాయి. చింతనలో కూడా ఉపనిషత్తుల భావవాదం చాలా మార్పులు తెచ్చింది. ఎన్నివున్నా ఆనాటి సాంఘిక వ్యవస్థగా కులవ్యవస్థ సంక్రమిస్తూనే వుంది. ఈనాటికీ వుంది. అయితే భిన్నరూపంలో ప్రయోజనాలని అందిస్తూవుంది. ఈ వ్యవస్థకి వ్యతిరేకంగా బుద్ధుడి నాటినుంచీ ప్రతిఘటనలు వుంటూనే వున్నాయి. నిజానికి బుద్ధుని పూర్వపు హిందూమతానికీ బుద్ధుని తరవాత హిందూమతానికీ గుణాత్మకంగా కాకపోయినా, పరిణామాత్మకంగా మార్పులు జరిగాయి. అందుకు కారణాలు అన్వేషిద్దాం. అయితే కులవ్యవస్థ మాత్రం సాంఘిక వ్యవస్థగా సంక్రమిస్తూనే వుంది. సర్వమానవ సమానత్వం ప్రకటించుకునే మధ్యయుగాలనాటి మతసంస్కరణవాదులైన బసవ, రామానంద, కబీరు వంటివాళ్ళు తమ అనుయాయుల్లో కులవివక్షను రద్దుచెయ్యాలని చూశారు. జైన, శైవ, వైష్ణవ మతాలలో కులభేద నిర్మూలనం ఒక సామాన్యధర్మంగా

కనిపిస్తుంది. పాల్కురికి సోమనాథుడు బ్రాహ్మణుల్ని దారుణంగా నిందించాడు. వైష్ణవంలో "సమాశ్రియణమను ముద్రలు వేయించుకుని ఊర్ధ్వపుండ్రధారులైన వారందరు ఒకే కులమువారని" (సురవరం ప్రతాపరెడ్డి, ఆంధ్రుల సాంఘికచరిత్ర). చిత్రం యేమంటే కుల నిరసన, బ్రాహ్మణ నిరసన (బ్రహ్మణ కూళలు, గార్ధభాలు, పశుకర్మలు, వ్రతభ్రష్టులు అని నిందించిన పాల్కురికి సోమనాథుడు చతుర్వేదాల సమర్థన సాక్ష్యంగా శైవమే అసలైందని చతుర్వేదసార సంగ్రహం రాశాడు. వేదాల అధికారం ఆరకంగా నిలబెట్టాడు!) ఆఖరికి ఆ వైష్ణవం, యీ శైవం కూడా మళ్ళీ కొత్త శాఖలుగా హిందూమతంలో భాగాలై కొన్ని సందర్భాల్లో మరికొన్ని ఉపకులాలుగా స్థిరపడ్డాయి. హిందూమత విశ్వాసాల పరిధికిందికి వచ్చే యీ దృక్పథాలలోనేకాక, కొత్తగా పుట్టిన కులాల్లో, యీ దేశానికి వచ్చిన క్రైస్తవ, ఇస్లాములలో కులాలు చక్కగా చోటు సంపాదించుకున్నాయి. సిక్కుల్లో వున్నాయి. కేరళలో సిరియన్ క్రైస్తవులు, 16వ శతాబ్దంనాటి రోమన్ కాథలిక్ మిషనరీలు మత మార్పిడులు జరిపించారు. అలా మారి వచ్చినవాళ్ళు అసలు కుల భావనను వదల్లేదు. వదల్లేదు సరికదా, వాటిని క్రైస్తవ మతంలో ప్రవేశపెట్టారు. (అరుంధతీ రాయ్, ది గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్.)

ఇక హిందూమతంలో ప్రబలంగా వున్న విశ్వాసం పునర్జన్మ. భారతదేశంలో పుట్టిన బౌద్ధంలో కూడా యీ ఆత్మ పునర్జన్మ భావం ప్రవేశించింది. క్రైస్తవ మతంలోగాని, యూదు మతంలోగాని, ఇస్లాంలోగాని యీ భావన లేదు. ఆత్మ, సంసారబంధం అనేవి పెనవేసుకుపోయిన భావాలు. స్వర్గం, నరకం అనేవి తాత్కాలిక అనుభవ దశలు. అసలు లక్ష్యం మోక్షం. అందుకు ప్రయత్నం చెయ్యడమే మనిషి కర్తవ్యం. ఆత్మ, పునర్జన్మ భావనలు సమర్థనీయం కావడానికి కర్మఫలం, కర్మభావనలు ఉపాంగాలు. అయితే యీ కర్మ అన్న భావన, పుణ్య పాప ఫలాల పద్దు హిందూమతంలో భాగంగా సంక్రమించాయి. పునర్జన్మ, కర్మ భావనలు వేదంలో, ఋగ్వేదంలో లేవు. ఎలా వచ్చి యీ మతంలో చేరాయో అన్నది చారిత్రక పరిశీలనాంశం.

మొత్తంమీద హిందూమతం పునాదులు కులవ్యవస్థ, పునర్జన్మ భావన, కర్మ భావన. భక్తిజ్ఞానం, వైరాగ్యం వంటివి మోక్షసాధన మార్గాలు.

శైవ, వైష్ణవ, స్మార్త మధ్వశాఖల్లాంటి ద్పక్పథ శాఖలు వున్నా వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత అందరికీ ప్రమాణాలే.

స్థూలంగా యిలా విభజనకిందకు ఒదిగే హిందూమతం సామాన్యంగా అందరికీ అర్థమయే తీరు యిదీ. అయితే యీ వ్యవస్థ ఆదినుంచీ ఒక్కలాగానే లేదు. ఎన్నో మార్పులు చెందింది. ఎన్నో కొత్తవి వచ్చి చేరాయి. అందుకనే వేదాల సనాతనధర్మం, పౌరాణిక భాగవత హిందూమతం భిన్నంగా వుంటాయి. బౌద్ధమతానికి పూర్వం వున్న మతం, తర్వాత వచ్చిన మతం మౌలికంగా విభేదించకపోయినా మార్పులతో దర్శనమివ్వడం ప్రత్యేకత.

ఆ మార్పులేమిటో కొద్దిగా చూడడం అవసరం. దేవతలలో, ఆరాధనల్లో వచ్చిన మార్పులు పైన చూశాం. బౌద్ధమతం వచ్చేక కులవ్యవస్థకి పునాదులు కదలకపోయినా బిగువు సడలింది. బుద్ధుడి బోధనల్లో కులం ఒక వ్యవస్థగా ఉనికి, గుర్తింపు పొందలేదు. అది సాంఘిక విభజనగా వుండవచ్చుగాని, దానికి శాశ్వతత్వం లేదు. అంతర్గత సమర్థనా లేదు ("Caste might exist as a social distinction, it had no permanence no inner justification nor did ritual which was irrelavent and unnecessary for the good life" - D.D. Kosambi, The Culture and Civiligation of Ancient India.) గుప్తుల కాలంలో బ్రాహ్మణమత పునరుద్ధరణ ఆరంభమైంది. క్రీ.పూ. సుమారు 188 ప్రాంతాల్లో యీ పునరుద్ధరణ మొదలైంది. హిందూ పర్వదినాలు, ఉత్సవాలు, కొత్తదేవుళ్ళు రంగంమీదకు వచ్చేరు. శుంగవంశ పాలననాటికి మహాయాన బౌద్ధం విస్తరించింది. మహాయాన బౌద్ధం, పౌరాణిక హిందూమతం గుప్తుల కాలంలో పోలికలతో వుంటాయి. బౌద్ధ జాతకగాథల్లో వివరించిన బౌద్ధధర్మం భాగవత పురాణంలో చిత్రించిన భాగవత ధర్మంతో పోలికలతో వుందని పండితులు రాశారు. అసలు హిందూమత విశ్వాసంలో గోచరమయ్యే విష్ణువు అవతార భావనకు మూలం అక్కడే వుంది అనీ పండితులు అంటారు. పురాణాలు అనేక వైదికేతర దేవతలకు. ఆచారాలకు హోదా పెంచి తమ మత ద్పక్పథంలో యిముడ్చుకోవడం ఒక సంప్రదాయంగా వుంటూ వున్నదే. మహాభారతం యెన్ని పరిణామాలు చెందిందో యిందుకు దర్పణం. మొదట్లో యే 24 వేల శ్లోకాలో వున్న

గ్రంథం క్రీ.శ 200 నాటికి 80 వేలకు పెరిగింది. ఈ తర్వాత వచ్చిచేరిన భాగాలన్నీ మతదృక్పథం వెల్లడించేవే. అదీ యే మతదృక్పథం? హిందూమతం అని పిలిచే దృక్పథం. బ్రాహ్మణమత దృక్పథం. అంతకుముందు తలెత్తిన మతాలు సాంఘిక వ్యవస్థగా కులాన్ని, యజ్ఞ యాగాది క్రతువుల ప్రాముఖ్యం వున్న వేదాల్ని తగ్గించి చెప్పాయి. సాంఘిక చట్రంలో మార్పు వచ్చింది. మహాభారతం అలా పోయిన స్థానాన్ని తిరిగి సంపాదించి పెట్టేందుకు ఉపకరించింది. అందుకనే చేర్చిన భాగాలు అందివచ్చేయి. బౌద్ధమతంవల్ల నీరసించిన బ్రాహ్మణ ప్రతిష్ఠ, హోదా మళ్ళీ బ్రాహ్మణులు పొందగలిగేరు.

## కృష్ణుడు పరమ దైవతంగా ఎప్పుడు ఎదిగాడు?

ఆ చేర్పుల్లో ప్రముఖం అయిందే భగవద్గీత, అప్పటికి శ్రీకృష్ణుడు పరమ దైవతంగా యెదగలేదు. అయితే మహాభారతం తొలిదశలో ఏకత సాధించుకున్న బ్రాహ్మణీకృత ఇతిహాసంగా ఆ గాథా చట్రంలో యిమిడింది. (See D.D. Kosambi. అదే గ్రంథం, పే. 93.) మొత్తంమీద హిందూధర్మంలో మార్పులు వచ్చేయి. బ్రాహ్మణులు మిగిలిన మతాల ప్రభావంవల్ల అహింసను అంగీకరించారు. అంతకు పూర్వం వున్న ఆహార విహార నియమాలు మార్చుకున్నారు. ఉదాహరణకు వ్యాస భారతంలోనే వున్న వాటిని నన్నయ మార్పు చేసి రాయడం. "పాండవులు బాణములచే వివిధ మృగములను చంపి తన్మాంసమును మొదట బ్రాహ్మణులకు నివేదించి తరువాత తాము భుజించిరని యందలి యర్థము. తన కాలమునకు బ్రాహ్మణులు మాంసమును భుజించుట నిషిద్ధమైపోవుటచేత నన్నయ ఆ విషయమును విడిచియుండును" అని దివాకర్ల వేంకటావధానిగారు "నన్నయ్యభట్టు" అన్న గ్రంథంలో రాశారు. (నన్నయభట్టు, యువభారతి, పేజీ 37.) ఇంతకీ ఆ మూలం యేమిటో తెలుసుకోవాలికదా!

శుద్ధై ర్బాణై ర్నిపాతి తాన్
బ్రాహ్మణం నివేద్యాగ్ర మభుంజన్ పురుషర్షభా
రుమాన్ కృష్ణ మృగాంశ్చైవ మేధ్యానిశ్చాన్యాన్ వనే చరత్
బాణైరున్మధ్య విధివద్బ్రాహ్మణేభ్యోన్యవేదయత్.

ఈ రకంగా బౌద్ధ, బ్రాహ్మణ మత పైస్థాయి సిద్ధాంతాలు సారభూతంగా కలిసిపోయాయి. బౌద్ధమతం తర్వాత వచ్చిన హిందూమతం పౌరాణిక హిందూమతం.

అయితే ఆనాటి జీవిత విధానానికి నప్పే సైద్ధాంతిక భూమిక యింకా అవసరమయే వుంది. ఒక సమగ్ర సిద్ధాంతం నూతన జీవితానికి అన్వయించేటట్టు అవసరం అయింది. సమాజం పాత సంబంధాల పతనంతో కొట్టుమిట్టాడుతుంది. కొత్త విధానానికి పాత గ్రంథాల ప్రామాణికతనే చూపించడం అంత ఆమోదయోగ్యం కాదు. మరీ ముఖ్యంగా బౌద్ధ జైనాది అనేక దృక్పథాలు రంగంమీదకి వచ్చి ఓ రకంగా మార్పులు తెచ్చాక ఆ పద్ధతి అసలు అనువుగాదు. అదీగాక ఆసేతుశీతనగం విస్తరించిన యీ భౌగోళిక ప్రదేశంలో వున్న జీవిత విధానానికి యే ఒక్క సిద్ధాంత భూమిక మీదనో విశ్లేషించి సూత్రీకరించడం సమ్మతపూర్వకంగా జరిపించడానికి, ఒక్క దృక్పథం కిందకు తేవడానికి వేదాలు కూడా కీసవెలితే. భారతదేశ జీవిత విధానంలో మౌలికమైన భావన అనేకమైనవాటి సమ్మేళనంతో బతుకుదాం, బతకనిద్దాం (Live and let live. See Kosambi and Nehru both use the same phrase) అన్న జీవిత దృక్పథం పాదుకుంది. హిందూతత్వాన్ని అర్థంచేసుకునేందుకు చాలామంది చాలా వివరణలు యిచ్చేరు. మహాత్ముడు హిందూమతం అంటే యేమిటో తనకు తోచిన రీతిలో వివరించేడు: "హిందూ విశ్వాసాన్ని వివరించమని అడిగితే, నేను సీదాగా చెప్పేది యిది: అహింసామార్గం ద్వారా సత్యాన్వేషణ. దేవుణ్ణి యెవళ్ళైనా నమ్మకపోవచ్చు; అయినా హిందువును అనే చెప్పుకోవచ్చు. హిందూమతం సత్యమతం. సత్యమే దేవుడు. దేవుణ్ణి లేడనడం ఎరుగుదుం. సత్యాన్ని కాదనడం ఎరగం." అంటే గాంధీ దృష్టిలో సత్యం, అహింస హిందూమతం అవుతాయి. అయితే గాంధీజీ నిర్వచనంలో వున్న అహింస అనేది హిందూ విశ్వాసంలో మూలస్తంభంగా చాలామంది ప్రముఖ హిందువులు భావించరు. హిందూమతంలో వైవిధ్యభరితమైన సిద్ధాంతాల మేళన జరిగింది. అంచేత బతుకుదాం, బ్రతకనిద్దాం అన్న సూక్తి అన్ని నిర్వచనాలనీ మించి రూపొందింది. హిందూమతం ఏకకాలంలోనే యెంతో సహనపూరితమైంది గానూ, అంతే అసహనపూరితమైందిగానూ కనిపిస్తుంది. ("Hinduism is

at once the most tolerant and intolerant of creeds" - Stanly Rice, Hindu Customs and their origins, Page 115.) కులాల కట్టుబాట్ల బిగింపు ఓపక్క, యే దృష్టికోణాన్ని అయినా యిముడ్చుకునే ఔదార్యం మరోపక్కా యింత వైవిధ్యపూరితమైన దృక్పథానికి దర్పణంగా నిలిచింది భగవద్గీత.

ఆదిశంకరుల నుంచి ఆధునిక యుగందాకా గాంధీజీ నుంచి గురు గోల్వాల్కర్ దాకా యెందరో భగవద్గీతను తమకు తోచిన రీతిలో అన్వయించుకున్నారు, వివరించుకున్నారు. ఇన్నింటినీ గీత అందించ గలిగింది అంటే, యిన్నింటికీ మూలస్రోతస్సుగా వుందీ అంటే చాలా గొప్ప విషయమే.

## ప్రామాణిక ప్రాతినిధ్య గ్రంథం

భగవద్గీత హిందూమత విశ్వాసాలకి ప్రామాణిక ప్రాతినిధ్య గ్రంథం అయింది. ఆ స్థాయికి యెదిగిందని చెప్పుచ్చు, హిందూమతం యెదిగినట్టే. భగవద్గీత యే సాంఘిక నేపథ్యంలో వచ్చింది? ఏం చెప్పింది? ఏ ప్రయోజనం సాధించింది? ఈ విషయాలు తెలుసుకుంటే, హిందూ మతాన్ని వ్యాఖ్యానించి సూత్రబద్ధం చేసే స్థాయికి భగవద్గీత యెలా యెదిగిందీ తెలుస్తుంది.

భగవద్గీత అనే పేరు రావడమే చిత్రంగా వచ్చింది. భగవంతుడు ఉపదేశించినటువంటిది. సాక్షాత్తూ భగవంతుడే 'యిదండీ నేను ఉప దేశిస్తున్న ధర్మం' అని చెపుతూవుంటే యెవళ్ళు కాదుపొమ్మంటారు? మోజెస్‌కి సెనై పర్వతంమీద దైవవాణి టెన్‌కమాండ్‌మెంట్స్ అందజేస్తే యెవళ్ళూ పెదవి మెదపకుండా నెత్తిమీద పెట్టుకున్నారు. భగవంతుడు స్వయంగా విధిస్తూవుంటే కాదనేవాడుంటాడా? అదికూడా సాక్షాత్తూ విష్ణుమూర్తి అవతారంగా వచ్చిన రూపంలో. చిత్రం యేమిటంటే, ఆ విష్ణుమూర్తి మరో అవతారం అనే మాధ్యమం ద్వారా-మీడియా ద్వారా-వ్యవహారం నడిపిస్తాడేగాని యెకాయెకీ తను రాడు. మన సినిమా తారల బొమ్మలు కలిగించిన ప్రభావం అసలు వ్యక్తులుగా వాళ్ళు కలిగించలేరు కాదా! కొంత నిగూఢత్వం ఆవరించుకుని వుంటేనేగాని లేదా కుమ్ముకుంటే గాని జనం విస్మయం చెందరు. యదార్థ పరిస్థితి యదార్థంగా కనిపిస్తూనే

వుంటుంది. కాని విశ్వాసాల స్థాయికి పెంచడానికి అది దారి యివ్వదు. సైద్ధాంతిక కవచం వుంటేనేగాని శిరస్సు బలి పెట్టడం జరగదు. "ఆశయాలకోసం అసువులు ధారపోశామప్పుడు" అని తృప్తిపడాలంటే ఆ ఆశయాలు మనిషిని ఉత్తేజితం చెయ్యగలిగి వుండాలి. యుద్ధంలో సైనికులు ప్రాణాలకు తెగిస్తున్నారంటే అందుకు తగ్గ నమ్మకం పునాది వుండాలి కదా! 'హిందూమత' పునరుద్ధరణలో గీత సైద్ధాంతిక భూమికను అందించింది. అనేక దృక్పథాలని మిళితం చేసింది. అంతకు ముందు విరుద్ధంగా వున్నట్టు కనిపించేవాటిని సమన్వయపరచింది. అప్పటికి సాంఘికంగా వున్న అస్థిర పరిస్థితిని సవరించడానికి, కొత్తగా వస్తూవున్న రాజ్య పరిస్థితులకు కొత్త నీతిసూత్రాల్ని అందించింది. ఆ పరిస్థితులు యేమిటో, అప్పుడు వచ్చిన నూతన ధర్మసూత్రాలు ఏమిటో చూస్తే గీత ప్రాశస్త్యం తెలుస్తుంది.

## సామాజిక అవసరం

కొత్త మతాలుగాని, దార్శనిక దృక్పథాలుగాని పుట్టాలీ అంటే వాటికి సామాజిక అవసరం వుండి వుండాలి. క్రీ.పూ. ఆరవ శతాబ్దంలో ఉత్తర భారతంలో చాలా కొత్త మతాలు పుట్టుకొచ్చాయి. ప్రపంచవ్యాప్తంగా అయితే చైనాలో కన్ఫ్యూషియన్ సిద్ధాంతాలు, ఇరాన్‌లో జోరాస్టర్ సిద్ధాంతాలు వచ్చేయి. ఆనాటి ఉత్తర భారత భూభాగంలో అజితకేశకంబళుడు, చార్వాకులు భౌతికవాదాన్ని ప్రబోధించేరు. జైన మహావీరుడు, మక్కలి గోశాల బుద్ధునికి సమాకాలికులు, బౌద్ధమతం మధ్యేమార్గాన్ని బోధించింది. వైదిక యజ్ఞయాగాల నిష్ఫలత్వాన్ని యెత్తిచూపించడం అప్పటికే వచ్చింది. ఉపనిషత్తుల్లోనే వాటికి విముఖత వెల్లడైందని తెలిసింది. బుద్ధుడి అష్టాంగమార్గం నూతన సిద్ధాంత ప్రతిపాదకంగా వచ్చింది. ఈ సిద్ధాంతాలవల్ల వైదిక కట్టుబాట్ల బిగువు సడలింది. మరి రాజ్యయంత్రం కూడా మార్పులకు గురైంది. అలెగ్జాండర్ దాడి (దండయాత్ర అనతగ్గంత స్థాయి లేదని కోశాంబి అంటారు.) మౌర్య సామ్రాజ్య స్థాపన వేగవంతం అయింది. మగధ సైన్యం యావత్ ఖండాన్ని కొంచెం యించుమించుగా అధీనంలోకి తెచ్చుకుంది. ప్రతి జనపదాన్ని (గణాన్ని అని అర్థం) ఓడించింది. మౌర్యసామ్రాజ్యం కొత్త పాలనా విధానాన్ని ప్రవేశపెట్టింది.

మొత్తంమీద మగధ సైన్యాలవల్ల, మాసెడోనియన్ దాడులవల్ల మళ్ళీ గణజీవితం, పశుపోషణ, సంచారజీవితం గడ్డుపరిస్థితుల్ని యెదుర్కొన్నాయి. ఉపనిషత్తుల గణరాజ్యాలు పోయేయి. వాటిలో గణానికి విధేయులై బతకడమే వుండేది. నూతన ఆర్థిక వ్యవస్థకి కేంద్రీకృత, బలోపేత రాజ్యాలు అవసరం అయేయి. కొత్తగా వచ్చిన మగధ కాలం రాజులు అసలు క్షత్రియులుకారు. అందుకనేనేమో 'నందాంతం క్షత్రియకులం' అని బ్రాహ్మణ పురోహితవర్గం సూత్రీకరించింది. మౌర్యసామ్రాజ్యం దక్షిణాదికీ విస్తరించింది. అటు గాంధారదేశందాకా విస్తరించింది. ఇండో-ఆర్యన్ బ్రాహ్మీలిపి యీ దశలో రూపుతీసుకుంది. ఈ యుగంలోనే వైద్యం, ఖగోళశాస్త్రం, గణితం అభివృద్ధిచెందాయి. ఈ యుగం సాంఘికంగా గొప్ప మార్పుల్ని తీసుకువచ్చింది. సామాజిక మత జీవితంలో, ఆలోచనల్లో పెద్ద కలకలం రేగింది.

ఆ కలకలం యేమిటి? వర్ణవ్యవస్థ, వేదాల అపౌరుషేయత్వం, యజ్ఞాల ప్రయోజనం, పునర్జన్మ, కర్మ, మోక్షం, ఆత్మ, బ్రహ్మ వంటి భావనలన్నీ చర్చలయేయి. బౌద్ధమతం ఆనాడు వున్న దృక్పథాలన్నిటిలోకీ కేంద్రస్థానంలో వుంది. మగధ యుగాన్ని యీ కారణంగానే బౌద్ధయుగం అనీ అంటారు. బుద్ధుడు వేదాల అధికారాన్ని అంగీకరించలేదు. యజ్ఞక్రతువుల్ని కాదన్నాడు. పై వర్ణాలు కింది వర్ణాలు అని తేడా లేకుండా సన్మార్గం ప్రవర్తనలో వుంటే చాలు అన్నాడు. దీనికి కులం అనే ప్రసక్తే లేదు. సాంఘిక అసమానతలకు హేతువు పేదరికం, జీవికకు ఆధారం లేకపోవడం అన్నాడు.

మగధ యుగంలో పెద్ద కలకలం రేగిందని చూశాం. దానివల్ల అప్పటిదాకా వున్న అనేక భావనలకు పునాదులు కదిలిపోయాయి. బౌద్ధమతం దానికి కేంద్ర స్థానంలో వుంది. ఉపనిషత్తుల నాటి మధుర, హస్తినాపుర, ఇంద్రప్రస్థ ప్రాంతాల నుంచి సాంస్కృతిక, రాజకీయ కార్యకలాపాలు రాజగృహానికి, పాటలీపుత్రానికి మారేయి. మౌర్య సామ్రాజ్యం ఉచ్ఛస్థితిలో వుంది. అశోకుని కాలం నాటికి పతాక స్థాయికి చేరింది. అశోకుని కాలంలోనే మౌర్యసామ్రాజ్య హద్దులు ఇటు ఒరిస్సా, మధురలదాకా, అటు గాంధారదేశం (యీనాటి ఆఫ్ఘనిస్తాన్) దాకా విస్తరించేయి. క్రీ.పూ. 200 సంవత్సరం నాటికి వున్న పరిస్థితి అదీ.

బౌద్ధమతం ఆనాటి సాంఘిక నిర్మాణ పునాదుల్ని కదిలించడంతో వర్ణవ్యవస్థ పట్టు సడలింది. వైదిక, ఉపనిషత్, బ్రాహ్మణ మతం బౌద్ధమత బోధనల వల్ల పలచబడిపోయింది.

వైదికమత పునాదుల్ని కదిలించడంలో బౌద్ధం కృతకృత్యమైంది గాని ప్రత్యామ్నాయ మతంగా ప్రజల్ని బంధించి వుంచే పట్టు దానికి లేకపోయింది. అందుకు కారణాలు అనేకం వున్నాయి. మొదటిది బౌద్ధ సంఘాలు. రెండవది సైద్ధాంతికంగా భౌతిక దృక్పథాన్ని స్థిరంగా పాదుకొల్పే సామాజిక పరిస్థితి లేకపోవడం. మూడవది కులవ్యవస్థ. చివరిగా బౌద్ధం కూడా భూస్వాముల చేతిలో కీలుబొమ్మ అవడం.

బౌద్ధ సంఘాలు కుల వివక్షను పాటించవు. సొంత ఆస్తి వుండ కూడదు. ఆనాటి సాంఘిక పరిస్థితుల యధార్థ స్థితికి యీ ఆశయాలు అందుకోలేని ఆదర్శాలే. వాస్తవంతో పొత్తు కుదరని ఊహాస్వర్గాలే.

ఇక సిద్ధాంతపరంగా ఒక అధికార భావజాలం బ్రాహ్మణ మతం అందించినంతగా బౌద్ధం యివ్వలేకపోయింది. భౌతిక పరిస్థితులు మూఢనమ్మకాలనీ, భగవత్ విశ్వాసాన్నీ, మోక్ష భావననీ తప్పించే పట్టు అనుకూలిస్తే తప్ప మనిషికి వాటిమీద నమ్మకంపోదు. కర్మకాండల విషయంలోనూ యింతే. మూఢనమ్మకాలతో వుండే కర్మకాండలే అయినా మనిషిని అవి యేదో ఒక కార్యాచరణలో నిమగ్నం చేస్తూనే వుంటాయి. అయితే కర్మకాండలు క్రమేపీ మారుతూ వుండవచ్చు. పీడిత వర్గాల వాళ్ళకి ఆ నమ్మకాలు, ఒక రకంగా, బతుకు యీడ్చడానికి ఆసరా అవుతూవుంటాయి. పరిస్థితులు దోహదం చేస్తే తప్ప ఆ దేవుడుగాని, మూఢనమ్మకాలుగాని, ఆ మతంగాని రంగంమీద నుంచి నిష్క్రమించవు. ఇంత శాస్త్ర విజ్ఞానం అభివృద్ధిచెంది, ప్రకృతి శక్తుల్ని యెంతో అదుపులోకి తెచ్చుకున్న నేటి యుగంలోనే నమ్మకాలు నమ్మకాకుండా మనుతున్నాయే, మరి ఆనాటి పరిస్థితుల్లో? బౌద్ధమతం ప్రజలకు సమానత్వం అయితే బోధించింది, అందరూ మోక్షానికి అర్హులేనని చెప్పింది, సత్ప్రవర్తన వంటివి ఆ అర్హతని అందిస్తాయని చెప్పింది. యీ బోధన అంతా జన సామాన్యాన్ని ఆకర్షించేదే. నిజంగా బుద్ధుడు బోధించిన అంశాలు, సాంఘిక రాజకీయ ఆర్థిక సూత్రాలు యీనాటికీ విస్మయం కలిగించేవే. (బుద్ధుడి ఆర్థిక సిద్ధాంతాన్ని గురించి వివరిస్తూ "This is

startingly modern view of political economy. To have profounded is at a time of vedic yajna to a society that had just begun to conquer primeval jungle was an intellectual achievement of the highest order" అని డి.డి. కోశంబి రాశాడు. The Culture and Civilization of Ancient India in Historical outline, page 113, Vikas. 1976)

ఇక కుల వ్యవస్థ విషయం. బుద్ధుడు కులానికి మన్నిక వుండదనీ, అంతర్గతంగా దానికి సమర్థనా వుండదనీ చెప్పాడు. ఆయన ఆర్థిక అభిప్రాయాల లాగానే యిదీను. భారత సామాజిక నేపధ్యంలో వర్ణవ్యవస్థ, కులం ఒక ప్రత్యేక పాత్రగా వున్నాయి. యెలా పుట్టుకొచ్చాయి అన్న విషయం అలా వుంచినా, ఒక సామాజిక, ఆర్థిక, మతపర పాత్ర అవి సంతరించుకున్నాయి. వ్యవసాయంకేసి మళ్లుతువున్న సమాజంలో అది విస్తరించడానికి ఆనాడు వర్ణవ్యవస్థ అనువుగా వుంది. వర్ణవ్యవస్థ లేని బౌద్ధం యెంత మహత్తర ఆశయాలు బోధించినా, అవన్నీ ఆదర్శప్రాయమే అవుతాయి గాని ఆచరణకు నడిపించే శక్తిని అందించలేవు. భౌతిక పరిస్థితులు మనుషుల దృక్పథాల్ని మార్చినంత పట్టుగా మరే బోధనలూ మార్చలేవు. యీవాళ కులం అనే వ్యవస్థకి సాంఘికంగా విధి నిర్వహణ కర్తవ్యంయేదీ లేకపోయినా అది మనుతూనేవుంది. ఒక భావనాత్మక బంధాన్ని అది కలిగించింది, రాజకీయమైనది గానివ్వండి, ఆర్థికమైనది కానివ్వండి. ఒక ప్రయోజనం సమకూరడానికి నిలిచేవుంది. అదీ యింత పారిశ్రామిక సాంకేతిక అభివృద్ధి సాధించిన యీ యుగంలో! మరి అలాంటిది ఉత్పత్తి ప్రక్రియలో భాగంగా వున్న ఆనాడు? అంచేత బౌద్ధమతం కులం కోటను భేదించలేకపోయింది; బిగువు సడలించినప్పటికీ.

ఇక ఆఖరిగా బౌద్ధమే సంపన్నవర్గాల చేతిలోకిపోయి రాజకీయాధికారానికి ఆనుకర్ర అయింది. నిరాడంబరంగా, అట్టహాసాలూ ఆర్భాటాలూ లేకుండా బతుకు మార్గం వుండాలని బోధించిన బౌద్ధమతం అట్టహాసాలికీ, హంగు ఆర్భాటాలకీ మారిపోయింది. పురోహితవర్గం ఐశ్వర్యలాలసత్వంతో, దర్పంగా డాబుగా జీవించే పరిస్థితి వచ్చింది. బుద్ధుడికే బంగారు విగ్రహాలు వెలిశాయి. ఆఖరికి బుద్ధుడే దేవుడయ్యాడు.

బౌద్ధమతం భారతదేశంలో వేళ్లనిలుపుకుని దృఢంకాలేకపోయినా, ఉపనిషత్ బ్రాహ్మణ మతం మాత్రం అంతకుముందు వున్నట్టు ఉనికిలో లేకుండా కొత్త రూపంలో ప్రత్యక్షం అయ్యేటందుకు యిది భూమిక అయింది. వైదిక మతం నూతన అవతారంలో ప్రత్యక్షం అవడానికి ముందే బౌద్ధం మహాయాన శాఖలో అనేక మంది దేవతల్ని చేర్చుకుంది. బుద్ధ జాతక కథలు పుట్టుకొచ్చాయి. బోధిసత్వ భూములు పదిఅట. అనేక జన్మల ఫలంగా బుద్ధుడే "బౌద్ధత్వం" అందుకునే కల్పనలు వచ్చాయి. బౌద్ధం అనేక పాయలుగా చీలింది. విగ్రహారాధన, మంత్రాలు, కర్మకాండలు, తాంత్రిక విద్యలు చోటు చేసుకున్నాయి.

మతపరంగా పరిస్థితి యిలా వుంటే, రాజకీయంగాను అంత గడ్డు స్థితివచ్చింది. మౌర్యసామ్రాజ్యం క్షీణించింది. శక, కుషాన్ దాడులు తీవ్రమయ్యాయి. అలెగ్జాండర్ దాడి లాంటివి కావు అవి. అనేక తెగలు, భారీ స్థాయిలో, చొచ్చుకురావడం అది. అలాంటి నేపథ్యంలో వర్ణవ్యవస్థకు యింకా ముప్పు ముంచుకురావడం తప్పదుకదా! మగధ సామ్రాజ్యం నాటికే బౌద్ధప్రభావం వల్ల ఆ సాంఘిక వ్యవస్థకు కీళ్లు సడలేయి. యీ కొత్త దాడులతో మరింత ప్రమాదం యెదురైంది. వర్ణసంకరం అనేది స్మృతికారులకు పెను భయకారకం అయింది. గీతాకారునికీ అదే భీతి పట్టుకుందికదా!

సాంఘికంగా, ఆర్థికంగా చిత్రమైన పరిస్థితి యేర్పడింది. బౌద్ధమతం ఉపనిషత్ సమాజాన్ని నీరసపరచగలిగింది గాని సమాజాన్ని ఆమూలాగ్రం బంధించి వుంచగలిగే కొత్త సంబంధాల్ని అందించలేకపోయింది. దాంతో కొత్త దారి యేర్పడాల్సిన అవసరం కలిగింది.

ఆ అవసరం తీర్చేందుకు నూతన రూపంలో తెరమీదకు వచ్చిందే మార్పుచెందిన వైదికమతం. పౌరాణిక హిందూమతంగా, భాగవతమతంగా కొత్తరూపంలో యిది యేర్పడి, మార్పులు చేర్పులతో యింకా వుంది. యీ మారిన పౌరాణిక హిందూమతంలో లేదా, భాగవత హిందూమతంలో బౌద్ధమత భావాలు, ఆనాటికి ప్రాచుర్యంగా వున్న అనేక యితర ధోరణులు సిద్ధాంతాలు వచ్చి చేరాయి. వైదిక, వైదికేతరమైన ధోరణులన్నీ సమ్మేళనం చెందాయి. ఉదాహరణకు బౌద్ధమతంలోని అహింస బ్రాహ్మణ మతం ప్రధాన ధోరణిగా అంగీకరించింది. బ్రాహ్మణులు గోమాంసంతో సహా

మాంసాహారాన్ని త్యజించేరు. ఇక సిద్ధాంతపరంగా "The higher philosophies of both Buddhist and Brahmin began to converge in essence" (డి.డి.కోశంబి). బౌద్ధమతం అందర్నీ సమంగానే పరిగణించింది. అందరూ మోక్షానికి యోగ్యులే, సత్ప్రవర్తనతో వుంటేనని చాటింది. ఈ అంశాన్ని వర్ణ వ్యవస్థను పునరుద్ధరించిన కొత్త హిందూమతం గ్రహించింది.

మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రాః తేఽపి యాంతి పరాంగతిమ్

పార్థా! నన్ను ఆశ్రయించిన వాళ్లు ఎవరైనా సరే - పాపజన్ములు గాని, స్త్రీలుగాని, వైశ్యులుగాని, శూద్రులుగాని పరమ శాంతిపదం పొందుతారు-గీత 9-32)

చిత్రం మేమిటంటే - స్త్రీలని, వైశ్యుల్ని, శూద్రుల్ని పాపజన్ముల సరసన చేర్చి చెప్పడం! సరే, ఆ విషయాన్ని అలావుంచినా భగవంతుణ్ణి ఆశ్రయిస్తే పరమపదం లభిస్తుందన్న మేరకు కొత్త ప్రతిపాదనే.

బౌద్ధమతం తర్వాత, మౌర్యసామ్రాజ్యపతనం తర్వాత, శక, కుషాన్‌ల దాడుల ప్రభావం వల్ల మారిన పరిస్థితుల్లో తలెత్తిన సంక్షోభం పరిష్కారం కావాల్సి వుందికదా! కొత్తగా వైదిక మతాన్ని పునఃరుద్ధరించడం జరుగుతుంది కదా! (అంతకుముందు బౌద్ధ యుగంలో ఆ మతాన్ని అవలంబించిన పాలకులు కూడా సంపూర్తిగా వైదిక మతాన్ని వదిలెయ్యలేదు. శాతవాహన చక్రవర్తుల్ని యిందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు.) వర్ణ వ్యవస్థను నిలబెట్టాలి. కొన్ని క్రతువుల్ని పునరుద్ధరించాలి. విగ్రహారాధనల్ని యిముడ్చుకోవాలి. అదే సమయంలో వేదాల అధికారాన్ని కాదనకూడదు. ఉపనిషత్తుల భావవాద చింతననీ కలుపుకోవాలి. అంటే, వైదిక వైదికేతర అంశాలనెన్నిట్నో ఒక తాటి మీదకు తీసుకురావాలి. అలా చెయ్యదగ్గ గ్రంథం అప్పటికిలేదు. కొత్తదివస్తే దానికి ప్రామాణికత సిద్ధించడం యెలాగ? యే రకంగా కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించే దారి కనుక్కోవాలి? మగధ సామ్రాజ్య దశ తర్వాత "The old had faded, the new was yest to be born. Considering the stage of evolution of the times, a very much renovated though not a new religion was clearly needed."

"The bible of that religion was the Geeta" (Marxism and the Bhagawat Geeta: S.G. Sardesai Dilip Bose, Page 14.)

అలా అవతరించిన మతానికి స్మృతులు, పురాణాలు, మహాభారతం, అందులో భాగంగా వున్నట్టు కనిపించినా ప్రత్యేకత గల భగవద్గీత చుట్టూ అల్లుకున్నాయి. నిజానికి మహాభారతం, పురాణాలు గుప్తుల కాలం నాటికి పూర్తిస్థాయికి చేరుకున్నాయి. ఇవన్నీ బ్రాహ్మణ ప్రాశస్త్యాన్నీ, వర్ణ వ్యవస్థ చట్రాన్నీ చాటి నిలబెట్టేటందుకే రూపొందేయి.

మహాభారతంలో భాగంగా వుంది, గీత అని సామాన్యంగా వ్యవహరించే భగవద్గీత.

దీని సన్నివేశం ఆసక్తికరంగా కనిపిస్తుంది. మహాభారత యుద్ధం జరగబోతుంది. కౌరవ, పాండవ పక్షాల సేనలు కురుక్షేత్రంలో అటూ యిటూ మోహరించివున్నాయి. శ్రీకృష్ణుడు రథసారథిగా అర్జునుడు రథం యుద్ధభూమిలో వుంది. శంఖాలు పూరించి యుద్ధం ఆరంభించే సమయంలో అర్జునుడికి విషాదం కమ్ముకుంది. ఉన్నట్టుండి

సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయమేఽ చ్యుత

అచ్యుతా! రెండు సేనల మధ్య నా రథాన్ని నిలబెట్టు అన్నాడు. కృష్ణుడు అలానే చేశాడు.

ఆచార్యాః పితరః పుత్రాః తథైవ చపితామహా మాతులాశ్శ్వశురాః పౌత్రాః స్యాలాన్యలుంధినస్తథా (గురువులు, తండ్రులు, కుమారులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమరుదులు, ఇతర బంధువులూ). అటు సైన్యంలో వున్నారు. అంతా రక్త సంబంధీకులే. ఇలాంటి బంధుత్వం వున్నవాళ్ళని చంపా తను రాజ్యసుఖాలు సంపాదించేది? యేం బావుకుందామని?

ఏతా న్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన!
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే!

(మధుసూదనా! వాళ్లు నన్ను చంపితే చంపనీ. ముల్లోకాలనూ ఏలే అవకాశం కలిగినా నేను మాత్రం వాళ్లను వధించదలచుకోలేదు. అలాంటప్పుడు ఈ రాజ్యంకోసం వాళ్లను చంపుతానా?)
అని చేతులెత్తేస్తాడు.

అప్పుడు కృష్ణుడు మొదలెడతాడు. "క్షుద్రం హృదయదౌర్బల్యం" - అంతేకాదు, క్లైబ్యం మాస్మగమః (నపుంకుడిలాగ అధైర్యం పొందకు - అన్నీ నేనే సృష్టించాను అని ఒకటికి రెండుసార్లు చాటుకునే భగవానుడు యీ బాపతు వాళ్లనెలా సృష్టించినట్టో!) అని హెచ్చరిస్తాడు. చంపేదెవరు? చచ్చేదెవరు? "(వాసాంసి జీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతి నరోఽ పరాణి'' (మనిషి చిరిగిపోయిన బట్టల్ని వదిలేసి కొత్త బట్టలు తొడుకున్నట్టే) ఆత్మ ఓ శరీరం వదిలి కొత్త శరీరంల్లోకి ప్రవేశిస్తుంది తెలుసా అంటాడు. (చిరిగిపోయిన బట్టల్ని మార్చుకోవడం వేరు, చించేసి- యిక్కడ చంపేసి- ఆత్మ వేరే చోటికి పోతుందనడం వేరు.) ఆత్మ శాశ్వతంగా వుంటుందని మొదలుపెట్టి పెద్ద ఉపన్యాసం 18 అధ్యాయాలు సాగదీసి రకరకాల విషయాల్ని వల్లించేస్తాడు. ఆ విషయాలు యేమిటో యెలా అవి ప్రసక్తం అయేయో చూసేముందు యీ సన్నివేశం ఆ సమయంలో తూగేటట్టు వుందా అన్నది చూడాలి. వివేకానందులు కూడా అది అసంగతంగా వుందని అన్నారు. ఏడువందల శ్లోకాలు వున్న దీన్ని యెంత గబగబా చదివినా మూడు గంటలు తక్కువ పట్టదే, ఆ వ్యవధిలో మొత్తం యుద్ధమే ముగిసిపోతుంది కదా; అంచేత అది అసందర్భంగా వుందని కోశాంబి అన్నాడు. "Certainly the eighteen chapters of the Geeta were not produced between Krishna and Arjuna right in the middle of the field of battle, as the traditional account tells us" అని ఎస్.ఎ. డాంగే రాశారు. భగవద్గీతను తర్వాత కాలంలో మహాభారతంలో యీ సన్నివేశ కల్పనతో జోడించారని దీన్నిబట్టి గ్రహించాలి. సరిగ్గా యుద్ధసమయంలో యిలాంటి తాత్విక విచికిత్సకు అవకాశం వుంటుందా అన్న శంక తలెత్తడం సహజం. అయితే బంధు గణాన్ని చంపడం పాపం అన్న భావన కలగడంలో వింత యేమీ లేదు. ఆనాటి బౌద్ధిక ప్రపంచంలో చెలరేగిన సంక్షోభానికి అది ప్రతీక. దీన్ని పరిష్కరించే నైపుణ్యం శ్రీకృష్ణుడి ద్వారా ప్రదర్శింప చేశారు. శ్రీకృష్ణుడు విష్ణుమూర్తి అవతారంగా గణన పొందాడు. ఆనాటికి ప్రచారంలో వున్న సిద్ధాంతాలనన్నిటిని తన ప్రతిపాదనలుగానే భగవానుడు ప్రకటించాడు. అన్ని అభిప్రాయాలూ సాక్షాత్తూ భగవంతుని ముఖతః వస్తూవుంటే విచికిత్సకు ఆస్కారం యెక్కడిది? అలా వెల్లడైన భావాలలో చాలా మట్టుకు బుద్ధుడి బోధనలు

నుంచి తీసుకున్నవే. (a great deal of doctrine later palmed off in Krishna's name was surreptitiously borrowed from Buddhism-Kosanbi). ఆ మాటకొస్తే కృష్ణుడి విశేషణాలు భాగవత, నరోత్తమ, పురుషోత్తమ కూడా బుద్ధునికి సంబంధించినవే. భగవంతుని హోదాలో శ్రీకృష్ణుడు ప్రవచించిన దానికి ప్రామాణికత సిద్ధించడం విధాయకమేకదా! ఒక సైద్ధాంతిక సంక్షోభాన్ని పరిష్కరించి, వైరుధ్యాలని సమసింపచేసి, ఆ రకంగా కొత్త వైరుధ్యాన్ని లాఘవంగా సిద్ధాంతం చేసిన ఘనత గీతకు దక్కుతుంది. అందుకనే గీత నుంచి యెవరికి "తోచిన అర్థం" వాళ్లు గ్రహించారు. త్రిమతాధిపతులూ వాళ్లకనుకూలమైన తీరులో వాళ్లు వ్యాఖ్యానాలు చెప్పుకున్నారు. స్వాతంత్రోద్యమ కాలంలో నాయకులకి గీత అనేక అర్థాలనందిస్తూ ఆసరా అయింది. "Even the leaders of thought and action of the present day - Tilak, Arobindo ghosh, Gandhiji-have written on it each giving his own interpretation. Gandhiji bases his firm belief in non riolence on it, others justify voilence and warfare for a righters cause" (Jawaharlal Nehru, The Discovery of India). "వందేమాతరం" నినాదాన్ని దేశానికి యిచ్చిన బంకించంద్ర చట్టోపాధ్యాయ అనుశీలన భావాన్ని పాదుకొల్పేడు. భగవద్గీత ఆధారంగా ధర్మయుద్ధం చెయ్యచ్చని ప్రతిపాదించాడు. ఆర్.ఎస్.ఎస్, అధినేత గురు గోల్వాల్కర్ మహోదయులకు భగవద్గీతలోని కర్మ-స్వధర్మ పాలన భావాలు హిందూమత పునరుద్ధరణకు పిలుపుగా వినిపించాయి. ఆయన "ఆలోచనాగుచ్ఛం"లో చాతుర్వర్ణ వ్యవస్థ సమర్థనా, హిందూ సంస్కారాలూ, హైంద వేతరులకు "రాష్ట్రధర్మం" చాటి చెప్పడమూ దర్శనమిస్తాయి. ముస్లిమ్‌లు పరాయి వాళ్లు. క్రైస్తవం విదేశీయం. కమ్యూనిజం విజాతీయ సిద్ధాంతం. యీ బాపతు భావాలన్నీ గోల్వాల్కర్ ఉద్ఘాటించేరు. భగవద్గీత ఆయనకు యీ రీతి కనువిప్పు కలిగించింది. వీటన్నిటినీమించి రజనీష్ మహాశయులకు, కృష్ణ చైతన్య సంఘంవారికీ భగవద్గీతలో "free love", "permissiveness" కనిపించేయి. (Marxism and Bhagawat Geeta, Sardesai, Dilip Bose, page 4.)

స్వాతంత్రోద్యమ కాలంలో ఖుదీరామ్ బోస్ వంటివాళ్లు గీతను చేత్తో పట్టుకునే ఉరికంబం యెక్కారు. ఎంతమంది స్వాతంత్ర్య పోరాట యోధుల్నో భగవద్గీత ఉత్తేజపరిచింది.

ఈ రకంగా అంతమందికీ అన్నీ అయి, ఎంతమందికో యెన్నో అయి భాసించిన "గీత" లో యేముంది?

భగవద్గీతలో 18 అధ్యాయాలు వున్నాయి. రణ భూమిలో అర్జునుడు విషాదంతో యుద్ధం చెయ్యనని అస్త్ర శస్త్రాలు కింద పడెయ్యడంతో అర్జున విషాదయోగం మొదటి అధ్యాయం మొదలవుతుంది. రెండవది సాంఖ్యయోగం. దీన్ని Yoga of Knowledge అని ఇంగ్లీషులో అన్నారు. 3. కర్మయోగం. Yoga of action. 4. జ్ఞానయోగం The Yoga of knowledge as well as the disciplines of action and knowledge, 5. కర్మసన్యాస యోగం. Renuvciation of Karma 6. ఆత్మసంయమన యోగం. The Yoga of self control 7. విజ్ఞానయోగం. The Yoga of Jnana (Knowledge of Nirguna Brahma and Vijnana knowledge of manifest divinity) 8. అక్షరపరబ్రహ్మయోగం. The Yoga of the indestructible Brahma 9. రాజవిద్యారాజగుహ్యాయోగం. The Yoga of sovereign science and sovereign secret. 10. విభూతియోగం. Yoga of devine manisfestations 11. విశ్వరూప సందర్శనయోగం. The Yoga of the vision of the universal form. 12. భక్తియోగం. The Yoga of devotion. 13. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగం. The Yoga of descrimination between the field and the knower of the field. 14. గుణత్రయ విభాగయోగం. The Yoga of division of three gunas. 15. పురుషోత్తమ ప్రాప్తియోగం. The Yoga of the Supreme Person. 16. దైవాసుర సంపద్విభాగయోగం. The Yoga of division between the devine and Demoniaeal properties. 17. శ్రద్ధాత్రయ విభాగయోగం. The Yoga of the Division of the three fold faith. 18. మోక్ష సన్యాస యోగం. The Yoga of liberation through the path of knowledge and self-surrender.

ఇలా పద్దెనిమిది అధ్యాయాలలో గీతోపదేశం సాగింది. ( పద్దెనిమిది సంఖ్య ప్రాముఖ్యం యేమిటో శాస్త్రీయమైన విశ్లేషణ జరగలేదు. మహాభారతం పద్దెనిమిది పర్వాలు. మహాభారత యుద్ధం పద్దెనిమిది రోజులు జరిగింది. కురుపాండవ సైన్యం పద్దెనిమిది అక్షౌహిణీలు. ఈ కారణంగా భగవద్గీత కూడా పద్దెనిమిది అధ్యాయాలతో వుందనుకోవచ్చు. ఇలాకాకుండా కూడ పద్దెనిమిదికి ప్రాముఖ్యం కనిపిస్తుంది. పురాణాలు

18, విద్యలు 18, స్మృతులు 18, తీర్థాలు 18, యింతేకాదు - లౌకికమైన కావ్య దోషాలు 18, దానాలు 18, నాటికలు 18, వర్ణనలు 18, జాతులు 18, వివాద స్థానాలు 18.)

ప్రతి అధ్యాయం చివర "ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని...... అధ్యాయం సమాప్తం" అని ముక్తాయింపు ఆ అధ్యాయ అంశానికి వున్న పేరుతో ముగుస్తుంది. "శ్రీమద్భగవద్గీతాసూపనిషత్తు" అని దేవనాగరి లిపిలో ఉపనిషత్ వ్యవహారం వుంది. భగవద్గీత స్థాయి అప్పటికే విశిష్ట స్థానం పొందిన వాటి సరసన చేరినట్టు దాఖలాగా మహాభారత గాథలో దీన్ని ప్రవేశపెట్టినవాళ్లు యిలా రూపొందించారేమో! ఉపనిషత్తులు అప్పటికే ప్రామాణికం అయ్యాయి.

ప్రతి అధ్యాయాన్ని 'యోగ' అని వ్యవహరించారు. ఈ పదానికి అర్థం యేమిటి? జన వ్యవహారంలో యోగ విస్తృత వ్యాప్తిలో ఒక అర్థంలో వాడడం కనిపిస్తుంది. రాజయోగం, అదృష్టయోగం, వాహనయోగం వంటి పదబంధాల్లో "యోగ" అన్న మాటకు అపూర్వవస్తు ప్రాప్తి కలగడం అన్న అర్థమేవుంది. భగవద్గీత రెండవ అధ్యాయం 48వ శ్లోకంలో-

*యోగస్థః కురు కర్మాణి సజ్గం త్మక్త్వా ధనంజయః!*
*సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్చ్యతే!!*

అని యోగ అన్న మాటకి అర్థ వివరణ వుంది. అంటే, ఫలం దక్కినా దక్కక పోయినా కర్మలు సమ భావంతో సాగించు అర్జునా!-ఈ సమదృష్టినే యోగమంటారు. "సమత్వం" దృష్టి -equanimity or balance of mind- యోగ అవుతుంది. షడ్దర్శనాలలోనూ యోగ అన్న శాఖవుంది. పతంజలి యీ తాత్విక శాఖ మూల పురుషుడు (యోగ తాత్వికశాఖ ఆధ్యాత్మిక భావనలు సంగతి యెలా వున్నా శారీరక వ్యాయామం ఆరోగ్యకారకమైందే. "Yoga within limits is a good system of exercise in a hot climate for people who do not live by muscular exertion and hard physical labour. The most that one can attain by is some measure of control over normally involuntary functions of the body, and good health,

but no super natural powers" అని కోశాంబి రాశాడు.) యోగం అన్నపదం ఇంగ్లీషు మాట union అర్థాన్ని యిస్తుందని, బహుశా ఇంగ్లీషు మాట yoke అన్నదానికి సమమనీ కొందరంటారు yoke అంటే joining, కలపడం అని. "The word yoga 'harnessing' or 'applying oneself to' so that Karma yoga may be rendered as 'devotion to the discharge of social obligations'" అని హిరియణ్ణ వివరించారు. (Out lines of Indian Philosophy, p 119.)

యోగ అన్నపదాన్ని భగవద్గీత ప్రకారమే అయితే సమచిత్తం అలవరచుకోవడం అన్న అర్థంలోనూ, కర్తవ్య నిర్వహణకు నడుం కట్టడం అన్న అర్థంలోనూ వాడి వుండచ్చు.

ఇకపోతే యిందులో ప్రధాన పాయగా వున్న చింతనాధోరణి మీద సాంఖ్య ప్రభావం గురించిన అంశం వుంది. సాంఖ్య తత్వం చాలా ప్రాచీనమైనదని తత్వవేత్తలు చెపుతారు. దాదాపు ఉపనిషత్తులంత అనీ అంటారు. అలా అని పూర్తిగా సాంఖ్య సిద్ధాంతమూ గీతలో అధిపత్య స్థానంలో లేదు. ఏమంటే కొన్ని విభేదాలు కనిపిస్తాయి. ఉదాహరణకు సాంఖ్యంలో లేని ఉత్తమ పురుషభావన యిక్కడ వుంది.

అదేవిధంగా కైవల్య భావనకి సంబంధించినీ. ఇలా భేదాలు తాత్విక స్థాయిలో వున్నప్పటికీ భగవద్గీత అవసరాలకి సాంఖ్య సిద్ధాంతాన్ని సర్దుబాటు చేసుకోవడంలో అవి ప్రతిబంధకం కాదు. అయినా గీత యెన్ని సిద్ధాంతాల్నో సర్దుబాటు చేసుకుని కొత్త దృక్పథాల్ని ప్రవచించినటువంటిదే కదా! ఉదాహరణకు బుద్ధం శరణం గచ్ఛామి అన్న సూక్తిలోని శరణం గచ్ఛామి భావాన్ని గ్రహించింది. గీతలో అడుగడుగునా కనిపించే ప్రతిపాదన "నన్ను శరణుజొచ్చినవాళ్ళకి" యేలోటూ రాదు, నన్నే శరణు వేడుకో, "నన్ను ఆశ్రయించినవాళ్లు ఎవరైనాసరే పరమశాంతిప్రదం పొందుతారు" (9-32). ఆ రకంగా జనాలకి భక్తసులభుడైన భగవానుడు చేరికయ్యేడు. ఇలాంటిభావం ఉపనిషత్తుల్లో, బుద్ధుడికి పూర్వం వుండే అవకాశం లేదు. యిది భగవద్గీత అందించిన కొత్త బోధ, అలాగే అహింసకి సంబంధించిన కీర్తిగానం గీతలో చాలాచోట్ల కనిపిస్తుంది. దయ, కరుణ వంటి భావాలకి మంచి పీట వెయ్యడం కనిపిస్తుంది. ఇవన్నీ కూడా ఉపనిషత్ సంప్రదాయం నుంచి వచ్చినవి కాదు, బౌద్ధ సంప్రదాయం నుంచి వచ్చినవే.

మరి భగవద్గీతలోని యీ పద్దెనిమిది అధ్యాయాల్లోనూ చర్చించిన విషయాలేమిటి? అర్జునుడి విషాదాన్ని తొలగించడానికి వాదనలతోపాటు చేసిన ప్రయత్నాలేమిటి? మొత్తంమీద భగవద్గీత అందించిన జీవిత సందేశం యేమిటి?

భగవద్గీత పద్దెనిమిది అధ్యాయాల్లోనూ చర్చించిన విషయాలు ఆయా అధ్యాయాలకు వున్న శీర్షికలనిబట్టే తెలుస్తాయి.

మొదటి అధ్యాయం అర్జున విషాదయోగంలో అర్జునుడు రక్తసంబంధీకుల్ని చంపడం అపచారం అని దుఃఖంతో కుంగిపోతాడు. రక్తసంబంధీకుల్ని చంపితే వంశక్షయం అవుతుంది. వంశనాశనంతో కులధర్మాలు నశిస్తాయి. అధర్మం ప్రబలిపోతుంది. అధర్మం ప్రబలితే కులస్త్రీలు చెడిపోతారు. "స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః" (1-41) దాంతో జాతిసంకరం జరుగుతుంది. పితృదేవతలకు పిండోదక కార్యాలు లేక అధోగతి పాలవుతారు. కులాన్ని నాశనం చేసే వాళ్ళమూలంగా వర్ణ సంకరం, దాంతో "ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మా శ్చ శాశ్వతాః" (శాశ్వతాలైన జాతిధర్మాలూ, కులధర్మాలూ అడుగంటిపోతాయి) కులధర్మాలు నశిస్తే శాశ్వత నరకవాసులవుతారు.

(ఇలా 47 శ్లోకాలు యీ విషాదంలో ముంచెత్తేస్తాయి. కులాలకి శాశ్వతత్వం లేదనీ, దానికి ఆంతర్గత సమర్థనా లేదనీ చాటిన బౌద్ధానికీ కులధర్మాలే శాశ్వతమనీ, వర్ణ సంకరమే నరకప్రాప్తి హేతువనీ చెప్పే యీ భావనకీ యెంత వార వుందో చూడండి.)

రెండవ అధ్యాయం సాంఖ్య యోగం. "ఈ సంక్లిష్ట సమయంలో నీకు యిదేం పాడు బుద్ధి?" అని చీవాట్లు పెడుతూ కృష్ణుడు యుద్ధం ప్రారంభించమంటాడు. అయితే, అర్జునుడు మళ్ళీ మొదటికొచ్చి పూజార్హులైన భీష్మ, ద్రోణుల్ని బాణాల్తో యెలా కొట్టగలనయ్యా? వాళ్లని చంపి రాజ్యభోగాలు అనుభవించగలనా? లోకాధిపత్యం, స్వర్గాధిపత్యం సిద్ధించినా నాశనేం తగ్గుతుందా?" అని తను మధనపడుతున్న శంకని మళ్లీ ముందుకుతెస్తాడు. అపుడు శ్రీకృష్ణుడు "పెద్ద తెలివైనవాడిలా మాట్లాడతావేంటి? దుఃఖించవలసిన అవసరంలేని వాళ్లకోసం దుఃఖిస్తున్నావు నువ్వు. చచ్చిపోయిన వాళ్లగురించి కాని, బ్రతికున్న వాళ్ల గురించి కాని వివేకులు శోకించరు. అంతే నేమిటి? నువ్వు నేనూ వీళ్లంతా

గతంలోనూ వున్నాం, భవిష్యత్‌లోనూ వుంటాం, తెలుసా" అంటాడు. (దీనికి ఉపపత్తులేమిటో చూపించడు. పాపం, అర్జునుడు అడగనూ అడగడు-విషాదంలో ప్రస్తుతం వున్నాడు కదా! గతం, భవిష్యత్తులు సంగతి యేమడుగుతాడు?)

శరీరం దశలు మారి యవ్వన, వార్ధక్యాలు వచ్చినట్టే మరణానంతరం మరో శరీరం వస్తుంది. ఇలా వివరిస్తూ "యీ విశ్వమంతావున్న ఆత్మ వస్తువు నాశనం లేనిది. దాన్నెవరు అంతం చెయ్యగలరయ్యా" అని చాటుతాడు. ఇలా ఆత్మ భావన శాశ్వతత్వాన్ని ప్రకటించి, శరీరం పోయినా ఆత్మ వుంటుందని ప్రకటిస్తాడు. అలాంటి ఆత్మ గురించి తెలిసినవాడు "ఎవరినైనా యెలా చంపుతాడు? చంపిస్తాడు" అంటాడు. ఈ సందర్భంలోనే "వాసాంసి జీర్ణాని..." (2.22) చిరిగిపోయిన బట్టల్ని మనుషులు వదిలేసి కొత్త బట్టలు తొడుక్కున్నట్టు ఆత్మ కృశించిన శరీరాన్ని వదిలి కొత్త దేహాలు పొందుతుందన్న అభిభాషణ వెలువడుతుంది. (ఇంతకు ముందే ప్రసక్తంగా యీ విషయాన్ని గురించి చెప్పుకున్నాం.) ఇక్కడి నుంచి ఆత్మ ఘనత్వ వర్ణన వస్తుంది. "నైనం ఛిన్దన్తి శస్త్రాణి..." (2.23) అన్న ప్రసిద్ధ ఉద్బోధతో నాలుగు శ్లోకాలు ఆత్మతత్వం తెలుసుకొమ్మన్న మంచి మాటలతో సాగుతాయి. అంచేత "నైనం శోచితు మర్హసి" నువ్వు శోకించాల్సిన పనిలేదని భరోసా యిస్తాడు. "జాతస్య హి ధ్రువో మృత్యుః" పుట్టినవాడికి చావు తప్పదు, చచ్చినవాడికి పుట్టుక తప్పదు. తప్పించరాని ఈ విషయంలో తపించనవసరంలేదు." ఇలా వాదిస్తూ పుట్టుక, మరణం గురించి తెలియనపుడు విచారించాల్సిన పనేమిటి అంటాడు. యింతా చెప్పి "ఈ ఆత్మ స్వరూప స్వభావాలు తెలుసుకున్నవాడు ఒక్కడులేడు." (2.29) అని తేల్చేస్తాడు. ఆత్మ అన్ని దేహాల్లోనూ వుంటుంది. దానికి చావులేదు అని మళ్లీ తనకి తెలిసిన అంశాన్ని చాటుతూ దుఃఖించనవసరం లేదు అని వూరడిస్తాడు. అదీగాక "స్వధర్మ మపిచావేక్ష..." నీ ధర్మం తెలుసుకో. జంకకు. క్షత్రియుడి ధర్మం యుద్ధం చెయ్యడం, అదే మహాభాగ్యం అనీ, భలే అవకాశం వచ్చింది, యీ యుద్ధం వచ్చింది, నువ్వు గనక యుద్ధం చెయ్యకపోతే కులధర్మాన్నీ, పేరుప్రఖ్యాతుల్నీ పాడుచేసి పాపం కట్టుకుంటావుస్మా అనీ భయపెడతాడు. (బంధువుల్ని చంపడం పాపమన్న అర్జునుడి బాధకంటే పేరు ప్రఖ్యాతులు, కుల ధర్మం పాడు చెయ్యడమే పాపం అని భగవానువాచ!) పాపం సంగతి

అలావుంచినా యిన్నాళ్లు నీ అంత పోటు మగాడు లేడని కదా అందరూ అనుకుంటున్నారు. వాళ్లు యిపుడు అనరాని మాటలు అంటారు. అది యెంత దుఃఖం? (పాపం, యెంతటి గడ్డు పరిస్థితి!) ఇపుడు మరో ప్రలోభపూరితమైన వాదన శ్రీకృష్ణుడు అర్జునుడి ముందు పెడతాడు. "హతో వా ప్రాప్స్యపి స్వర్గం.." ధర్మయుద్ధంలో మరణిస్తే స్వర్గం పొందుతావు. శత్రువులను జయిస్తే రాజ్యభోగాలు అనుభవిస్తావు అని ప్రత్యామ్నాయాలు ముందు పెడతాడు. (ముందు ముందు నిష్కామ కర్మం అంటూ బాకా వూదబోయే విషయాన్ని యిక్కడ మర్చిపోయినట్టుంది. లేకపోతే నెగ్గితే రాజ్యం, పోతే స్వర్గం అన్న ప్రలోభం యేమిటి?) మళ్లీ వెంటనే జయాపజయాల్ని, సుఖ దుఃఖాల్ని సమంగా భావించి యుద్ధంలోకి దిగమంటాడు. ఇలా యింతవరకూ "సాంఖ్య మతానుసారం" ఆత్మతత్వం గురించి వివరించేడట (2.39) ఇక యిపుడు నిష్కామ కర్మ గురించి చెబుతా విను అంటాడు. **40**వ శ్లోకం నుంచి **46**వ శ్లోకందాకా ఆత్మజ్ఞాని కావడం గురించి వివరించేకనే *"కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన! మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోఽ స్త్వకర్మణి"* (**2.47**) అన్న మకుటాయమైన బోధ చేస్తాడు. దీని అర్థం - కర్మలు చేయడం వరకే నీకు అధికారం. కర్మ ఫలంతో నీకు సంబంధంలేదు. కనుక ప్రతిఫలం ఆశించి కర్మ చేయకు. అలా అని కర్మలు మానడానికి చూడకు. (యీ బోధని పని చేసేవాళ్లకు బోధించినంతగా ఇనాటి పుణ్యాత్ములు పెట్టుబడిదార్లకు చెయ్యరు. వాళ్లు గనక కర్మఫలం ఆశించకుండా పెట్టుబడి పెట్టడం చేస్తే కొంపలంటుకోవూ?) ఇక్కడ కర్మఫలంతో సంబంధంలేని సమ భావననే యోగమంటారని విపులీకరిస్తాడు. ఫలితం ఆశించి కర్మ చేసేవాళ్లు అల్పులు అంటాడు. (వైదిక క్రతువులు చేసిన పూర్వులు యేదో ఒక కోరికతోనే కర్మలు చేశారు. భగవానుడి దగ్గర కొచ్చేసరికి పరిస్థితి మారింది.) ఇక్కడ నుంచి సమ భావన అలవరచుకోవడం గురించిన వివరణ సాగుతుంది. ఇంతట్లో అంత విషాదంలోనూ వున్న అర్జునుడు "స్థితప్రజ్ఞస్యకా భాషా.." స్థితప్రజ్ఞుడి లక్షణాలేమిటి? అతని మాటా, తీరూ యెలా వుంటాయన్న గొప్ప ప్రశ్న వేస్తాడు. మళ్లీ భగవానుడు ఆ తాడు అందుకుంటాడు. ఆత్మానందం అనుభవించేవాడు, కోరికలన్నీ విడిచిపెట్టినవాడు, అలాంటి వాడని చెపుతాడు. ఏ రకమైన పరిస్థితులు వున్నాసరే సంతోషంకాని, ద్వేషంకాని

పొందనివాడు స్థితప్రజ్ఞుడు. తాబేలు తన అవయవాలను లోపలకి ముడుచుకున్నట్టుగా ఇంద్రియాల్ని సర్వవిధాల విషయ సుఖాలనుంచి మళ్లించినవాడు స్థితప్రజ్ఞుడవుతాడని చక్కని ఉపమానంతో వివరిస్తాడు. ఇలా 64వ శ్లోకం నుంచి యీ అధ్యాయం ముగిసే 72వ శ్లోకందాకా యీ భావాన్ని విశదీకరిస్తాడు.

మూడవ అధ్యాయం "కర్మయోగం." రెండవ అధ్యాయం చివర్లో బ్రహ్మజ్ఞానం పొందినవాడి దృష్టి ప్రపంచ విషయాల మీదకు మళ్లదనీ, ఆ బాపతు జ్ఞానం కలిగితే మోక్షం కలుగదనీ చెప్పినదాన్ని అందుకుని అర్జునుడు "జ్ఞానమే గొప్పదైతే నన్ను యుద్ధకర్మకు యెందుకు ముందుకు తోస్తావు?" అని న్యాయంగానే శంక లేవదీస్తాడు. సరిగా చెప్పవయ్యా అని నిలదీస్తాడు. అపుడు శ్రీకృష్ణుడు సాంఖ్యులకు జ్ఞానయోగం, యోగులకు నిష్కామకర్మయోగం రెండూ లోకంలో వున్నాయని తెలియచేస్తాడు. కర్మ ప్రాశస్త్యం గురించి చెపుతూ "నియతం కురు కర్మ త్వం.. నీ కర్తవ్యకర్మ నువ్వు చెయ్యాల్సిందే. కర్మలు చెయ్యకుండా జీవయాత్ర సాగించలేవు" (3.8) అని ఆచరణాత్మక అంశాన్ని చెపుతాడు. "ముక్తసంగ స్సమాచార:" - ఫలాపేక్ష లేకుండా దైవప్రీతి కోసం కర్మలు చెయ్యి అంటాడు. పూర్వం యజ్ఞాలు చెయ్యవలసిన అవసరం గురించి సృష్టి కావించిన ప్రజాపతి నిర్దేశం యేమిటో వివరిస్తాడు. ఈ అధ్యాయంలో 11వ శ్లోకం నుంచి 16వ శ్లోకందాకా కర్మల వల్ల సిద్ధించే ప్రయోజనం గురించిన వివరణ వుంది. అయితే మళ్లీ నిష్కామంగా కర్మలు చెయ్యడం గురించిన హెచ్చరికా వుంది. జనకుడి వంటివాళ్లు నిష్కామ కర్మతోనే మోక్షం పొందారన్న విశేషాన్ని తెలియచేస్తాడు. (17-20). "యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః... ఉత్తముడు చేసినదాన్నే యితరులు అనుకరిస్తారు. ఆ ప్రమాణాల్నే లోకం అనుసరిస్తుంది అని చెప్పి, "మాటకు నన్నే చూడు - ముల్లోకాలలోనూ నేను చేసే పనేమీ లేదు. నాకు లేనిదికాని కావాల్సిందికాని యేమీ లేకపోయినప్పటికీ లోక వ్యవహారాలు నిత్యమూ నిర్వహిస్తూనే వున్నాను" (3.22) చూశావా మరి, అంచేత తప్పదుమరి. అంతేనా? "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్‌! స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" (ఇతరుల ధర్మం చక్కగా ఆచరించడంకంటే లోటుపాటులతో అయినా తన ధర్మం పాటించడమే మేలు, పరధర్మం భయభరితం కావడం

వల్ల స్వధర్మాచరణలో మరణమైనా మంచిదే అని అర్థం.) ఈ స్వధర్మం యేమిటైందీ ఆఖరు అధ్యాయంలో టీకాటిప్పణి అందించేడు. అపుడు అర్జునుడు మనిషి యిష్టం లేకపోయినా యిలా యెందుకు పాపాలు చేస్తున్నాడు అని ప్రశ్న వేస్తాడు. రజోగుణం వల్ల కలిగే కామక్రోధాలే అన్ని పాపాలకీ మూలం అని కృష్ణుడు చెపుతాడు. ఇంద్రియాల్ని నిగ్రహించు కొమ్మంటాడు. బుద్ధిని వశంలో పెట్టుకుని కామరూప శత్రువును జయించమని కర్మయోగం 43వ శ్లోకంతో ముగిస్తాడు.

నాల్గవ అధ్యాయంలో "జ్ఞానయోగం" గురించి వివరిస్తాడు. ఇది వినాశనం లేనిది. భగవానుడు దాన్ని పూర్వం సూర్యునికి ఉపదేశించానని చెపుతాడు. అపుడు అర్జునుడు "అదేమిటయ్యా, సూర్యుడు యేనాటివాడు! నువ్వుచూస్తే యిప్పటివాడవు. యిదెలా సాధ్యం?" అని విస్తుపోతాడు. "నాయనా, నీకూ నాకూ చాలా జన్మలు గడిచాయి. నువ్వెరగవు" అదీ చిత్రం, అని యే దాఖలాలూ అవసరం లేకుండానే ప్రకటించేసి మాయాశక్తి వల్ల తను పరమేశ్వర భావం విడవకుండా జన్మిస్తున్నట్టు వెల్లడి చేస్తాడు. అదీ యెప్పుడు? "యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య తదాऽऽత్మానం సృజామ్యహమ్" - ధర్మం చెడి అధర్మం ప్రబలినపుడల్లా తను పుట్టుకొస్తూవుంటాడు. ఇపుడు అదే పరిస్థితి వచ్చిందని అర్జునుడికి యిలా తెలియచెయ్యడంలోని అంతరార్థం భగవద్గీత బోధించే అవసరం పడిన అనాటి సాంఘిక పరిస్థితిని యెత్తి చూపడం వుందన్నమాట. అలా ఉద్భవించడం యెందుకు? "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగేయుగే" (4.7,8) ఈ రెండు శ్లోకాలు చాలా ప్రసిద్ధం అన్న విషయం విదితమే. తనమీదే మనసు లగ్నం చేసిన వాళ్లెంతమందో తనను పొందేరని చెపుతాడు. అయితే తను స్థాపించబోయే ధర్మం స్వరూపం యేమిటో, తనని పొందినవాళ్లు యెవరో చెప్పడు.

సరే, భగవద్గీతలో బోధించిందే ఆ ధర్మతత్వం అనుకోవాలి. అదీగాక తనని యెవరు యెలాగ ఆరాధిస్తారో అలాగే తను అనుగ్రహిస్తాడు. (4.11) ఇది చాలా విస్తృతమైన ప్రాతిపదిక. యేమంటే బహుదేవతారాధన, విగ్రహారాధన వున్న ఆనాటి సమాజంలో అందరికీ అందే పిలుపు యిది. ఈ సందర్భంలోనే "చాతుర్వర్ణం మయా సృష్టం గుణ కర్మ విభాగశః

తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్" (వారివారి గుణాలకు, కర్మలకు తగినట్టుగా నాలుగు వర్ణాలు నేనే సృష్టించాను. అయినప్పటికి వాటికి కర్తనైన నన్ను కర్తను కాదని శాశ్వతుడనని తెలుసుకో (4-13) అని వర్ణాలకి కారణం వివరించేస్తాడు. సామాజిక శాస్త్రవేత్తలూ మానవ శాస్త్రవేత్తలూ యీ సమస్య గురించి బుర్రలు బద్దలు కొట్టుకుంటూ శోధించడం యెంత అవివేకమో యీ సూత్రీకరణనిబట్టి గ్రహించెదరుగాక! ఎవళ్లు యేం చెయ్యాలో తర్వాత వివరణ వస్తుందికాని ప్రస్తుతానికి కర్మల గురించే కొనసాగిస్తాడు. కర్మతత్వం గ్రహించడం కష్టం (4-17) అని చెపుతూనే "జ్ఞానాగ్ని దగ్ధ" కర్మలు, వాటితోపాటు పూర్వపు వాసనల్ని నాశనం చేసుకున్నవాడు పండితుడని గ్రహించమంటాడు. అపుడు జ్ఞాన యజ్ఞం గురించి విశదీకరిస్తాడు. పాపాత్ములందరిలోనూ పాపివైనాసరే జ్ఞానమనే తెప్పతో పాప సాగరాన్ని దాటేస్తావు అని జ్ఞానం గురించి కీర్తిస్తాడు. "జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసా త్కురుతే తథా" (జ్ఞానమనే అగ్ని సర్వ కర్మలనూ భస్మం చేస్తుంది (4.37) ఆ రకంగా "నీ హృదయంలో కలిగిన సందేహాన్ని జ్ఞానమనే కత్తితో నరికేసి నిష్కామ కర్మయోగం అనుసరించమని ముగిస్తాడు. ఈ అధ్యాయంలో 42 శ్లోకాలలో యీ జ్ఞానయోగ విచికిత్స సాగుతుంది.

అయిదవ అధ్యాయం "కర్మసన్యాసయోగం". "ఓసారి కర్మ చెయ్యమంటావు, ఓసారి కర్మ సన్యాసం అంటావు. యేం చెయ్యాలో కచ్చితంగా చెప్పు" అంటూ అర్జునుడు మళ్లీ రొక్కిస్తాడు. దానికి జవాబే యీ కర్మసన్యాసయోగం. "జ్ఞానయోగం, కర్మయోగం ఒకటే అని గ్రహించినవాడే నిజమైన జ్ఞాని" (5-5) అని రెండింటికీ సమతూకం పెడతాడు. అన్ని భూతాల్లోనూ వుండే ఆత్మ, తన ఆత్మ ఒకటేనని తెలుసుకున్నవాడికి కర్మలు చేసినా ఎలాంటి దోషమూ అంటదు (5-7) అని భరోసా యిస్తాడు. ఫలాపేక్ష లేకుండా కర్మలు చెయ్యాలని మళ్లీ ముక్తాయిస్తాడు. ఇంద్రియ నిగ్రహం వుండాలని చెపుతాడు. పరమాత్ముడి మీదే దృష్టి, బుద్ధి, నిష్ట వుంచినవాళ్లు మోక్షం పొందుతారు. "విద్యా వినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని, శుని చైవ శ్వపాకే చ పణ్డితా స్సమదర్శినః" (విద్యావినయాలు కలిగిన బ్రాహ్మణుడిని, గోవును, ఏనుగును, కుక్కను, చండాలుని ఆత్మజ్ఞానులు (మూలంలో పణ్డితా

అని వుంది) సమదృష్టితో చూస్తారు) అని సమదృష్టి యెవరికి అలవడుతుందో చెపుతాడు (5-18). కామక్రోధాల్ని జయించాలి, మనో నిగ్రహం వుండాలి, సంశయాలు తొలగించుకోవాలి. అలా ఆత్మజ్ఞాన సంపన్నులైన సన్యాసులకు సర్వత్రా మోక్షం కలుగుతుంది అని చెపుతాడు. ఈ అధ్యాయంలో 29 శ్లోకాలు వున్నాయి.

ఆరవ అధ్యాయంలో "ఆత్మ సంయమన యోగం" గురించి వివరిస్తాడు. అర్జునుడు అడక్కుండానే భగవానుడు యీ అంశం గురించి యెకాయెకీ చెప్పుకుపోతాడు. "ఆత్మైవ హ్యాత్మనో బన్ధుః ఆత్మైవ రిపు రాత్మనః" (తన మనస్సే తనకు బంధువూ శత్రువూ కూడా). మానవుడు తనను తానే ఉద్ధరించుకోవాలి. (6-5) అని చక్కని ఉద్బోధ యిక్కడ వుంది. శరీరం, మనస్సు యెలా వశంలో వుంచుకోవాలో వివరిస్తాడు. యోగాభ్యాసం చెయ్యడం గురించీ, దానికి అనుసరించవలసిన పద్ధతి గురించీ విపులంగా చెపుతాడు. ఆహార విహారాల పరిమితుల గురించీ చెపుతాడు (6-16). "ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున, సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః" (అర్జునా, సమస్తజీవుల సుఖదుఃఖాలనూ తనవిగా తలచేవాడు యోగులలో శ్రేష్ఠుడని నా అభిప్రాయం - 6-32) అని చెపుతాడు. అప్పు డర్జునుడు మనస్సు చంచలం అనీ, వాయువును నిరోధించడంలాగ మనస్సును నిగ్రహించడం దుష్కరమనీ తన భయాన్ని వెల్లడిస్తాడు (6-33, 34). ఆ విషయంలో సందేహం లేదని, అయితే అభ్యాసం వల్ల, వైరాగ్యంవల్ల యెలా నిగ్రహించుకోవచ్చునో శ్రీకృష్ణుడు వివరించడం మొదలెడతాడు. మళ్లీ అర్జునుడు, శ్రద్ధ వున్నా మనోనిగ్రహం లోపిస్తేనే, నిలకడలేకపోతే "యిహపర సుఖాలు" రెండు దక్కకుండాపోతాయి కదా అని శంక వెల్లడిచేస్తాడు. అపుడు శ్రీకృష్ణుడు ధ్యానయోగి గొప్పతనం వివరించి, "నా మీదే మనస్సు" నిలిపి, నన్ను సేవించేవాడే ఉత్తముడని ప్రకటించి ముగిస్తాడు. యీ అధ్యాయంలో 47 శ్లోకాలు వున్నాయి.

తర్వాతి "విజ్ఞాన యోగం" అనే ఏడవ అధ్యాయం వస్తుంది. ఇది ఒక రకంగా యింతకుముందు చెప్పిన విషయాన్ని కొనసాగించి చెప్పడమే. "జ్ఞానం తే ఽహం సవిజ్ఞానం ఇదం వక్ష్యామ్యశేషతః యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యజ్జ్ఞా తవ్య మవశిష్యతే" (తెలుగు తాత్పర్యంలో

"బ్రహ్మజ్ఞానాన్ని గురించి నేను నీకు (స్వానుభవంతో) సంపూర్ణంగా చెపుతాను. దీనిని గ్రహిస్తే ఈ లోకంలో నీవు మళ్లీ తెలుసుకోదలచిందేమీ వుండదు." అని వుంది. (ఇక్కడ ఇంగ్లీషు తాత్పర్యాన్ని కూడా యివ్వడం బాగుంటుందనిపించింది. "I shall unfold to you in its entirety this wisdom (knowledge of God in this absolute formless aspect) along with the knowledge of the qualified aspect of God (both with form and without form) having known which nothing also remains yet to be known in this world" - Gita press. Gorakhpur - 1994 edition) తెలుగులో వున్న బ్రహ్మజ్ఞానం గురించి సందేహం కలగవచ్చనే ఇంగ్లీషు తాత్పర్యం యివ్వడం ఉచిత మనిపించింది) (7-2) తన శక్తి ఎనిమిది విధాలుగా విభజితమైన - భూమి, నీరు, అగ్ని వగైరా తీరునుంచి, జీవరూప ప్రకృతితో సహా సమస్త జీవులకూ తానే మూల కారణం అని తెలుసుకొమ్మంటాడు. సాత్విక, రాజసిక, తామసిక భావాలన్నీ "నా వల్లనే కలిగాయని తెలుసుకో"మ్మంటాడు. తనని సేవించే పుణ్యపురుషులు నాలుగు రకాలనీ, అందులో ఆత్మజ్ఞాని ఉత్తముడనీ చెపుతాడు. "అతను నన్నే పరమ గతిగా భావించి సేవిస్తాడు." కాబట్టి తన ఆత్మ స్వరూపుడతడేనంటాడు. జ్ఞాని జగత్తు సర్వమూ "వాసుదేవ మయం" అనే జ్ఞానంతో నన్నాశ్రయిస్తాడు అని చెపుతూ యితర దేవతల్ని కొలిచే వాళ్ల గురించీ చెపుతాడు."యోయో యాంయాం తనుంభక్తః" "ఏ భక్తుడు ఏ దేవతామూర్తిని పూజించకోరుతున్నాడో అతనికి ఆ దేవతామూర్తి పట్ల అచంచలమైన శ్రద్ధ నేను కలగజేస్తాను" అని విశాల దృష్టినందిస్తూ, ఆ దేవత ద్వారా అలా ఆరాధించిన వాళ్లు "నేను కలగజేసే కామితార్థాలను" పొందుతారు అని చెపుతాడు (7-21,22). ఇక యిక్కడినుంచీ తనను భజించేవాళ్లు యెలాంటివాళ్ళో, తనని ఆశ్రయించిన వాళ్లు మరణ కాలంలో కూడా యెలా తనని మరచిపోరో చెప్పి ముగిస్తాడు యీ విజ్ఞాన యోగాన్ని. ఇందులో 30 శ్లోకాలున్నాయి.

"అక్షర పరబ్రహ్మయోగం" ఎనిమిదవ అధ్యాయం. ఇంతకు ముందు అడగని ప్రశ్నల్ని బ్రహ్మమంటే ఏమిటి? అధ్యాత్మమంటే ఏమిటి? కర్మ అంటే ఏమిటి? అధిభూతమూ, అధిదైవమూ అనేవి ఏవి? ఈ శరీరంలో అధియజ్ఞుడెవరు? మరణ సమయంలో మనోనిగ్రహం కలవాళ్లు

నిన్నెలా తెలుసుకోగలుగుతారు?" అని అర్జునుడు అడుగుతాడు. వీటికి వివరణగానే యీ యోగాన్ని శ్రీకృష్ణుడు వివరిస్తాడు. "యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః...." (8-11). వేదార్థం తెలిసినవాళ్లు శాశ్వతమని చెప్పే పరమపదం గురించి వివరిస్తాడు.

"ఓంకారమనే ఒక్క అక్షరాన్ని ఉచ్చరిస్తూ నన్నే స్మరిస్తూ" చనిపోయినవాడు మోక్షం పొందుతాడు. ధ్యానయోగికి నేను సులభంగా లభిస్తాను. పునర్జన్మ పొందరు. బ్రహ్మలోకందాకా అన్నిలోకాలూ పునర్జన్మ కలగజేసేవే. "నన్ను పొందినవాళ్లకు మాత్రం మరోజన్మ లేదు" అని చెపుతాడు. బ్రహ్మలోక కాలాన్ని వివరిస్తాడు. పరబ్రహ్మతత్వం అగోచరం, శాశ్వతం అంటాడు. "అగ్ని, జ్యోతి, పగలు, శుక్లపక్షం, ఆరుమాసాల ఉత్తరాయణం - వీటిలో మరణించే బ్రహ్మోపాసకులకు బ్రహ్మప్రాప్తి కలుగుతుంది" అని ఆ మరణసమయాల విశిష్టతను తెలియచెప్తాడు. "శుక్ల మార్గంలో పయనించినవాడికి జన్మరాహిత్యమూ, కృష్ణ మార్గంలో పోయినవాడికి పునర్జన్మమూ కలుగుతాయి" అని మోక్షపథం వివరిస్తాడు. ఈ అధ్యాయంలో 28 శ్లోకాలున్నాయి.

తొమ్మిదవ అధ్యాయం "రాజవిద్యా రాజగుహ్య యోగం." భగవద్గీతలో వున్న అధ్యాయాలలో పేరుకూడా క్లిష్టంగా వున్న అధ్యాయం యిది. ఇక్కడ కూడా అర్జునుడు యేమీ అడక్కుండానే "గుహ్యతమం" వరకు రహస్యమైన జ్ఞానాన్ని "అసూయలేని" నీకు బోధిస్తున్నానని చాలా ఆదరణ పూర్వకంగా చెపుతాడు. ఆ అతిరహస్యం "బ్రహ్మజ్ఞానం." యిది తెలుసుకునే శ్రద్ధలేక మనుష్యులు "మృత్యుసంసార వర్త్మని" - మరణరూపమైన సంసార పథంలో పరిభ్రమిస్తున్నారు అని గుర్తుచేస్తాడు. తనలోనే సర్వప్రాణికోటీ వుంది. తన పర్యవేక్షణలోనే జగన్నాటకం సాగుతోంది. తనే అంతటా వ్యాపించి వున్నాడు. క్రతువు, యజ్ఞం, అన్నం, మంత్రం, ఔషధం అన్నీ తనే. యిలా అన్నీ తనే అయిన భగవానుడు, ఏకాగ్రచిత్తంతో నిరంతరం "నన్నేస్మరిస్తూ సేవించేవాళ్ళ" యోగక్షేమాలు చూస్తాడు. "యోగక్షేమం వహా మ్యహమ్" (9-22) (ఈ ముక్కనే ఎల్ ఐసి వాళ్లు మకుటంగా పెట్టుకున్నారు) ఇక తనని పూజించేవాళ్లు, యితర దేవతలని కొలిచేవాళ్లల్లా మళ్లీ మళ్లీ పుట్టకుండా, "నన్నే పొందుతారు" అని ఆధిక్యత తెలియచేస్తాడు. పరిశుద్ధమైన భక్తితో "పత్రం పుష్పం ఫలం

తోయం" యేదిచ్చినా "సాదరంగా స్వీకరిస్తాను" (9-26) అని చాటుతాడు. ఇక ఆఖరిగా తనని ఆశ్రయించినవాళ్లు ఎవరైనాసరే - స్త్రీయో వైశ్యాస్తథా శూద్రా - పరమ శాంతిపదం పొందుతారని మినహాయింపుల్లేకుండా "రాజవిద్యా రాజగుహ్య యోగం" ఉపదేశిస్తాడు. ఈ అధ్యాయంలో 33 శ్లోకాలున్నాయి.

పదవ అధ్యాయం "విభూతియోగం." ఇందులో భగవానుడు తాను యెలా యెలా వెల్లడయేదీ వివరిస్తాడు. Divine manisfestation అంతా విశదీకరిస్తాడు. అదీ అర్జునుడు అడగకుండానే. ఎందుకంటే, తన మాటలు విని అర్జునుడు ఆనందిస్తున్నాడు, కాబట్టి శ్రేయస్సుకోరి శ్రేష్ఠమైన దాన్ని మళ్లీ చెప్పాలనిపించి చెబుతున్నాడు. వివిధ భావాలు ప్రాణులకు వాటి వాటి కర్మానుసారం కలుగుతున్నాయి. "నేనే జగత్తుకు మూలకారణం అని గ్రహించిన బుద్ధిమంతులు "నన్నే భక్తిభావంతో భజిస్తారు" అని విశ్లేషిస్తాడు. అప్పుడు అర్జునుడు నీ ఘనతగురించి విన్నాను కాని (9-12, 13, 14, 15, 16, 17, 18) నీ లీలావిచ్యుతి గురించి వివరంగా చెప్పమని మంచి ఉత్సాహంగా అడుగుతాడు. దానికేం మహాభాగ్యం, కాని "నా విచ్యుతులకు అంతం లేదు" కాబట్టి ముఖ్యమైన వాటి గురించి చెపుతా వినమంటాడు. 20వ శ్లోకం నుంచి 40వ శ్లోకందాకా ఆ విశేషాలు వివరిస్తాడు. చైతన్యం తనే, బృహస్పతి తనే, సముద్రుడు తనే, ఓంకారం తనే, మాసాల్లో మార్గశిర్షం తనే, రుతువుల్లో వసంతం తనే, అంతేకాదు - "ద్యూతం ఛలయతాస్మి" మోసగాళ్లల్లో జూదాన్ని నేను అని కూడా చెపుతాడు. (9-36. రుద్రనమకంలో శివుడు స్తేనులకూ, తస్కరులకూ అధిపతి అని వుంది గమనించండి.) ఇలా అన్నీ చెప్పి "నా విచ్యుతి వివరాలన్నీ తెలుసుకోవడం వల్ల నీకు ప్రయోజనమేమీలేదు" అని ముగిస్తాడు. ఈ అధ్యాయంలో 42 శ్లోకాలు వున్నాయి.

పదకొండవ అధ్యాయమే ప్రఖ్యాతి చెందిన "విశ్వరూప సందర్శన యోగం." ఆత్మజ్ఞానసంబంధి విషయాలన్నీ చెప్పినందుకు అర్జునుడు ఆనందభరితుడైపోయి, తన అజ్ఞానమంతా అంతరించిందని ప్రకటిస్తాడు. ఆలా అని వెంటనే కర్తవ్యం అందుకోడు. "నీ మాహాత్మ్యం" విన్నాను "ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ" - ఈశ్వర సంబంధమైన నీ విశ్వరూపాన్ని సందర్శించాలని నా అభిలాష. (11.3). అంచేత

ఫరవాలేదనుకుంటే చూపించు అంటాడు. సరేకానీ అని శ్రీకృష్ణుడు చెపుతూ మామూలు కళ్లతో చూడలేవు కాబట్టి దివ్యదృష్టిని ప్రసాదిస్తున్నా చూడమంటాడు. కురుక్షేత్ర సంగ్రామం గురించి ధృతరాష్ట్రుడికి గచ్ఛత్ వ్యాఖ్య అందించాల్సిన సంజయుడు ఆ విశ్వరూపం యెలావుందో వర్ణించేడు. అప్పుడు అర్జునుడు ఆశ్చర్యచకితుడై నమస్కారంచేసి, విశ్వరూపం యెంత అద్భుతావహంగా వుందో (15-30) గ్రహించి చెపుతూ తనని అనుగ్రహించి "ఆది పురుషుడవైన నిన్ను గురించి తెలుసుకో దలచాను. నీ ప్రవృత్తి నాకు అర్థం కావడం లేదు" విశదీకరించ మంటాడు. అప్పుడు శ్రీకృష్ణుడు "నువ్వు యుద్ధం చేయకపోయినా శత్రుసైన్యంలోని వీరులంతా వినాశం పొందడం ఖాయం" అని చెపుతూ "మయైవేతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" - వీళ్లందర్ని ముందే చంపేశాను, నువ్వు నిమిత్తమాత్రుడిగా వుండు - అని చెప్తాడు. యుద్ధం చెయ్యమని మళ్లీ ఉద్బోధిస్తాడు. ఇక్కడ మళ్లీ సంజయుడు అర్జునుడి స్థితిని ధృతరాష్ట్రునికి వివరించి చెబుతాడు. తర్వాత అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి ఘనంగా ప్రతి శ్లోకంలోనూ కీర్తిస్తూ (36-49) మళ్లీ మామూలు రూపంలో దర్శనమియ్యమని అర్థిస్తాడు. ఆరకంగా శ్రీకృష్ణుడు మళ్లీ యధాపూర్వ రూపాన్ని, తన విశ్వరూపం దర్శించిన గొప్పదనం అర్జునుడికి దక్కి నందుకు అభినందిస్తూ, ధరిస్తాడు. అలా జరిగిందని సంజయుడు ధృతరాష్ట్రునికి తెలియచేస్తాడు. అర్జునుడు శ్రీకృష్ణుని ప్రశాంతమైన మానవరూపం చూసి "మనసు కుదుట" పడిందని సంతోషిస్తాడు. శ్రీకృష్ణుడు యెవళ్లకీ, యేవిధంగానూ లభించని "విశ్వరూప సందర్శన యోగం" భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున, జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప" - పరంతపా! విశ్వరూపుడైన నన్ను నిజంగా తెలుసుకోవడానికి, చూడడానికి చేరడానికి సాటిలేని భక్తితోనే సాధ్యపడుతుంది - అని అర్జునిడికి చెప్పి ముగిస్తాడు. ఈ అధ్యాయంలో 55 శ్లోకాలు వున్నాయి.

పన్నెండవ అధ్యాయం "భక్తియోగం." నిన్నే భజించే భక్తులు ఉత్తములా ఆత్మస్వరూపాన్ని ఆరాధించేవాళ్లు ఉత్తములా అని అర్జునుడు అడిగినదానిమీద శ్రీకృష్ణుడు యిచ్చిన వివరణే యీ యోగం. మొదట తనని ఉపాసించేవాళ్లే ఉత్తములని చెపుతూనే ఆత్మస్వరూపాన్ని ఉపాసించే

వాళ్లు తననే పొందుతారు లెమ్మంటాడు. అయితే వీళ్లశ్రమ ఎక్కువ. తననే పరమగతిగా భావించి, ధ్యానించేవాళ్లంటారే - వాళ్లని "అచిరకాలంలోనే నేను ఉద్ధరిస్తాను" (12-7) అని భక్తికి యెక్కువ హోదా యిస్తాడు. ఆడంబర కర్మలని వదలిపెట్టిన భక్తుడంటేనే తనకి యిష్టం అంటూ - యిలా యెలాంటి భక్తులంటే యిష్టమో 14 నుంచి 20 శ్లోకాల దాకా విపులీకరించి చెప్పి ముగిస్తాడు. ఇందులో 20 శ్లోకాలే వున్నాయి.

పదమూడవ అధ్యాయం "క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగం." ఇక్కడ ప్రకృతి, పురుషుడు, క్షేత్రం, క్షేత్రజ్ఞుడు, జ్ఞానం, జ్ఞేయంలాంటి వాటన్నిటి గురించీ చెప్పెయ్యమని అర్జునుడు అడుగుతాడు. అసలు క్షేత్రమంటే యేమిటో, క్షేత్రజ్ఞుడంటే యెవరో బోధపడాలి కదా! "ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే" కుంతికుమారుడా! యీ శరీరమే క్షేత్రం, దీనిని తెలుసుకుంటున్నవాడే క్షేత్రజ్ఞుడు అని వాటి తత్వం తెలిసినవాళ్లు చెబుతారంటాడు. అయితే "అన్ని క్షేత్రాల్లోనూ వున్న క్షేత్రజ్ఞుడు నేనే" నని తెలుసుకొమ్మంటాడు. ఇక యిక్కడి నుంచి క్షేత్రం ఆకారవికారాలూ, పుట్టుపూర్వోత్తరాలూ వివరిస్తూపోతాడు. జ్ఞానమంటే వివరిస్తాడు (13-12). మళ్లీ పరబ్రహ్మ ప్రస్తావన తెచ్చి వివరిస్తాడు. ఈ శరీరంలో అంటీ అంటునట్లుగా వుండే పరమాత్మసాక్షి, అనుమతించేవాడు, భరించేవాడు, అనుభవించేవాడు మహేశ్వరుడు పరమాత్మ అని చెబుతారంటాడు. ప్రతి వస్తువూ ప్రకృతి పురుషుల కలయికవల్లనే కలుగుతుంది, తెలుసు కొమ్మంటాడు. మళ్లీ కర్మఫలం అంటనివాడు పరమాత్మ, దేహంలో వున్నా దేనికీ కర్తకాడని గుర్తుచేస్తాడు. ఇంతకీ యీ యోగంలో శరీరం, ఆత్మల వివరణ యిలా సాగిందని కొంతమంది పండితులు వ్యాఖ్యానిస్తారు. మారే భౌతిక పదార్థం క్షేత్రం; చైతన్యశీల, శాశ్వతజ్ఞానసారం క్షేత్రజ్ఞమనీ వివరిస్తాడు. ఇందులో 35 శ్లోకాలు వున్నాయి.

పదునాల్గవ అధ్యాయం "గుణత్రయ విభాగయోగం." ఉత్తమ ఉత్కృష్ట జ్ఞానంగురించి అర్జునుడు అడక్కుండానే మళ్లీ భగవానుడు చెప్పినయోగం యిది. సత్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు శాశ్వతమైన ఆత్మను శరీరంలో బంధిస్తున్నాయి. అని గుర్తుచేస్తాడు. ఆయా గుణాల గురించీ, వాటి వల్ల కలిగే ఫలితాల గురించీ వివరిస్తాడు. ఈ గుణాలకు అతీతమైన పరమాత్మ తత్వం గ్రహించడం వివేకం. యీ

మూడు గుణాల్ని దాటినవాడి లక్షణా లేమిటని అర్జునుడు అడుగుతాడు. గుణాతీతుడి గుర్తులు యేమిటో 22 నుంచి 25 దాకా శ్లోకాల్లో వివరిస్తాడు. మళ్లీ యిక్కడా అన్నిట్నీ సమదృష్టితో చూడ్డం గొప్పదన్న భావాన్ని పునరుద్ఘాటిస్తాడు. అయినా అచంచల భక్తితో తనని సేవించేవాడు యీ మూడు గుణాలనూ అధిగమించి ముక్తిపొందే అర్హత సంపాదిస్తాడు అని తన మీద నుంచి దృష్టి చెదరనివ్వకుండా చెబుతాడు. ఈ అధ్యాయంలో 27 శ్లోకాలు వున్నాయి.

పదిహేనవ అధ్యాయం "పురుషోత్తమప్రాప్తి యోగం." సంసారమనే అశ్వత్థవృక్షం (రావిచెట్టు) నాశనం లేనిదని చెబుతారంటూ, ఆ వృక్షంవల్ల యెలా యేమేమి విస్తరించేదీ వివరిస్తాడు. దాని కొమ్మలు గుణాలవల్ల వృద్ధిచెందుతూ విషయ సుఖాలే చిగుళ్లుగా విస్తరిస్తాయి. ఈ సంసార వృక్షం స్వరూపంకాని, ఆదిమధ్యాంతాలుకాని ఈ లోకంలో ఎవరికీ తెలియవు అంటాడు. వైరాగ్యమనే ఖడ్గంతో దాన్ని ఖండించాలి. కోరికలన్నీ విడిచిపెట్టిన జ్ఞానులు బ్రహ్మపదం పొందుతారు అని బోధిస్తాడు ఐదు జ్ఞానేంద్రియాలద్వారా, మనస్సుద్వారా "విషయానుపసేవతే" - విషయాలను అనుభవిస్తాడు మానవుడు. అయితే జీవాత్మను మూఢులు చూడలేరు. నశించేవన్నీ క్షరం, మార్పులేని జీవుడు అక్షరుడు ఈ ఉభయులకంటే ఉత్తముడు పరమాత్మ. తను ఆ పరమాత్మ అయిన పురుషోత్తముడే. ఇలా "అతిరహస్యమైన ఈ శాస్త్రం" 20 శ్లోకాల్లో ముగుస్తుంది.

ఇక పదహారవ అధ్యాయం "దైవాసుర సంపద్విభాగ యోగం." ఇక్కడకూడా అర్జునుడు యేం అడక్కుండానే భగవానుడు యీ యోగాన్ని బోధిస్తాడు. 1,2,3 శ్లోకాల్లో యిరవై ఆరు సుగుణాల పట్టీ యిస్తాడు. అవి దేవతల సంపదవల్ల పుట్టినవాడికి కలుగుతాయని చెప్తాడు. రాక్షస సంపదవల్ల పుట్టినవాళ్లకి కపటం, దురహంకారం, కఠినత్వం, అవివేకం వంటివి కలుగుతాయి. ఇలా వాళ్ల దుర్గుణాలనీ, తద్వారా ప్రాప్తించే కష్టాలనీ 4 నుంచి 23 దాకా శ్లోకాల్లో వివరిస్తాడు. ఆఖరి శ్లోకంలో (24) శాస్త్ర విధానాలను తెలుసుకుని కర్మ చెయ్యాలని ఉద్బోధిస్తాడు.

పదిహేడవ అధ్యాయం "శ్రద్ధాత్రయ విభాగ యోగం." ఇంతకు ముందు గుణత్రయ విభాగయోగం పేరుతో 14వ అధ్యాయంలో త్రిగుణాల గురించీ వివరించేడు. అప్పుడు అడగని ప్రశ్న యిప్పుడు అర్జునుడు

అడుగుతాడు - "శ్రద్ధతో పూజలు చేసేవాళ్ల ప్రవృత్తి యెలాంటిది? సత్త్వమహోరజస్తమః? సాత్త్వికమా రాజసమా తామసమా? "దీనికి జవాబే యీ యోగం. మానవులందరికీ వాళ్ల వాళ్ల స్వభావాన్నిబట్టి శ్రద్ధ కలుగుతుందనీ, అసలు శ్రద్ధ అంటూ లేనివాడు వుండడు అనీ, దాన్నిబట్టే వాళ్లు వుంటారనీ వివరిస్తాడు. ఘోరమైన తపస్సులు చేసి శరీరాన్నీ, అంతరాత్మ అయిన తననీ పీడించేవాళ్లు అసుర స్వభావంవాళ్లు అంటాడు (17-6). ఈ సందర్భంలో ఆహార పదార్థాలనిబట్టి సాత్త్విక, రాజస, తామసులకు యెలాంటి వాటిపట్ల యిష్టం కలుగుతుందో ఆయుర్వే దభిషక్‌లాగా వివరిస్తాడు (9, 10, 11). అలాగే యజ్ఞాలలో సాత్త్విక రాజస, తామస భేదాల గురించి వివరిస్తాడు. ఇక శరీరంతో చేసే తపస్సు యేమిటో చెపుతాడు. "దేవద్విజగురు ప్రాజ్ఞపూజనం శౌచ మార్జనమ్, బ్రహ్మ చర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే" (17, 14). దేవతలను బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించడం, పవిత్రంగా వుండడం, కల్లాకపటం లేకుండా ప్రవర్తించడం, బ్రహ్మచర్యదీక్షనూ, అహింసా వ్రతాన్ని అవలంబించడం ఈ తపస్సుకిందకి వస్తాయి. ఇలానే వాక్ తపస్సు, మనస్సు తపస్సు వుంటాయి. ఇవి సాత్త్వికం. ఇలానే రాజస తామస తపస్సుల విభేదాలనీ వివరిస్తాడు. ఓంకార మహత్త్వం వివరిస్తాడు (17-23). ఓమ్ తత్ సత్ అనే మూడు పరబ్రహ్మ పేర్లు. ఈ మూడింటినీ వాడే విధానం గురించి చెబుతాడు. హోమం దానం, తపస్సు యితర కర్మలనీ, వాటిని అశ్రద్ధగా చేస్తే అసత్ అవుతూ యే ఫలితాలూ యిహ పరలోకాల్లో వుండవనీ చెపుతాడు. 28 శ్లోకాలు యీ అధ్యాయంలో వున్నాయి.

ఆఖరిదీ, పద్దెనిమిదవదీ "మోక్ష సన్యాస యోగం." సన్యాసం, త్యాగం వాటి స్వరూపాల్ని వివరించమని అర్జునుడు అడిగిన మీదట కృష్ణుడు మళ్లీ కర్మలగురించీ, వాటి త్యాగం గురించీ వివరించుకుంటూ పోతాడు. త్యాగం మూడు విధాలని తన అభిప్రాయం చెపుతాడు. యజ్ఞం, దానం, తపస్సు అనే కర్మల్ని విడిచిపెట్టకూడదు. అయితే, వీటిని కూడా ఆసక్తినీ, ఫలాన్ని విడిచిపెట్టే ఆచరించాలని తన మతంగా చెపుతాడు. తామసత్యాగం, రాజసత్యాగం అనే రెండింటి గురించీ వివరిస్తాడు. సాత్త్విక త్యాగం గురించీ వివరిస్తాడు. ఇక్కడ ఒక విలువైన మాట అంటాడు.

"కర్మల్ని పూర్తిగా వదిలిపెట్టడం శరీరం ధరించినవాడికి శక్యంకాదు. కనక కర్మఫలాలను విడిచిపెట్టినవాడే త్యాగి" అని తన అభిప్రాయంగా భగవానుడు చెపుతాడు. అలా త్యాగం చెయ్యకపోతే ఆ కర్మల్నిబట్టి మరణానంతరం ఫలితాలు వుంటాయి (17-12). కర్మలు ఫలించడానికి సాంఖ్యం చెప్పిన అయిదు కారణాలనీ వివరిస్తాడు. బుద్ధి సంస్కారం లేనివాడు తానే కర్తనని అనుకుంటాడు. ఇక్కడ మణిపూస లాంటి సూక్తి మరోటి చెపుతాడు. "కర్మల విషయంలో అహంకార మమకారాలు లేనివాడు ఈ ప్రాణులన్నిటినీ చంపినా హంతకుడు కాడు. కర్మలు అతనిని బంధించవు" (17, 17). కర్మల ఆధారం గురించీ, గుణభేదాన్నిబట్టి వాటి విభజన గురించీ వివరిస్తాడు. ఇక్కడ సాత్విక, రాజస, తామస జ్ఞానాల గురించి వివరిస్తాడు. అలాగే కర్మల విషయమునూ, కర్తల విషయమునూ, బుద్ధి గుణాలని గురించీ, ధైర్యగుణాల గురించీ సాత్విక రాజస తామస విభజన చేస్తూ వివరిస్తాడు. సుఖాలూ యీ మూడుగుణాల విభజన ననుసరించే వుంటాయని విశ్లేషిస్తాడు. వీటన్నిటి గురించిన వివరణ 18 నుంచి 40వ శ్లోకందాకా సాగుతుంది. అక్కడినుంచి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలకు వాళ్ల "స్వభావంవల్ల కలిగిన గుణాలనుబట్టి విభజితమైన" కర్మలేమిటో చెపుతాడు. (ఈ శ్లోకాల్నీ వీటి అర్థాల్నీ వివరంగా తెలుసుకోవడం మనకి అవసరం. ఏమంటే - వర్ణ విభజన భగవానుడే చేసినట్టు (4,13) చాటుకున్నప్పుడు "గుణకర్మ విభాగశః" అన్న తర్కం వుందికదా! ఇక్కడ ఆ గుణాలనిబట్టి జరిగిన కర్మ విభజన వివరణ వుంది. భగవద్గీతను నెత్తిమీద పెట్టుకుని వూరేగించేవాళ్లు దీనికి వ్యాఖ్యానం యెలా చేస్తారో గమనించేందుకు యిది ఉపకరిస్తుంది.)

*శమో దమ స్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవ చ।*
*జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్॥*

(17-42)

బ్రాహ్మణులకు స్వభావసిద్ధమైన కర్మలు ఇవీ: మనోనిగ్రహం, బాహ్యేంద్రియ నిగ్రహం, తపస్సు, శుచిత్వం, ఓర్పు, సత్ప్రవర్తన, శాస్త్రజ్ఞానం, అనుభవ జ్ఞానం, దేవుడిమీద నమ్మకం.

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥ (17-43)

పరాక్రమం, పౌరుషం, ధైర్యం, దక్షత, యుద్ధంలో పారిపోకపోవడం, దానం, పరిపాలనా సామర్థ్యం - ఇవి క్షత్రియుల కర్మలు.

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ (17.44)

వైశ్యులకు స్వభావం వల్ల కలిగిన కర్మలు వ్యవసాయం, పశు పోషణ, వ్యాపారం. ఇక శూద్రుల కర్మ సేవచేయడం.

ఇలా కర్మలని విభజించడమేకాదు, వాటిని ఆచరించే "శ్రద్ధకలిగిన వాడు సిద్ధి పొందుతాడు" (17.45) అని ప్రకటిస్తాడు. అంతేనా - "పరమాత్మను తనకు విధించబడ్డ కర్మలను ఆచరించడం ద్వారా అర్చించి మానవుడు పరమగతి పొందుతాడు" అని తేల్చిచెబుతాడు. ఎవళ్ల స్వధర్మం వాళ్లు ఆచరించాలి. యిదే అభిప్రాయం (3.35) "శ్రేయాన్ స్వధర్మో" అని చెప్పినచోటా వుంది. నిప్పును పొగకమ్మినట్టు కర్మలన్నిటికీ దోషం ఆవరించుకుని వున్నా, అందువల్ల ఏదైనా దోషమున్నా స్వభావ సిద్ధమైన కర్మను విడిచిపెట్టకూడదు అని (18.48) శాసించేశాడు. అక్కడి నుంచి బ్రహ్మ స్వరూపం పొందడానికి అర్హత లేమిటో వివరించుకుంటూ పోతాడు. (అయితే కర్మ చెయ్యడం, నిష్కామకర్మసిద్ధి పొందడం దీనికి పునాదిగా వుంటాయన్నది మరిచిపోకూడదు.) 49 నుంచి 54వ శ్లోకందాకా యీ వివరణ సాగుతుంది. అప్పుడు మళ్లీ తనపట్ల భక్తి వుండడం అవసర మవుతుందంటాడు. భక్తివల్ల భగవానుడి స్వరూప స్వభావాల్ని తెలుసుకున్న అనంతరం "నాలో ప్రవేశిస్తాడు" అని చెప్పి (18.55) తన మీద భక్తి వుంటే యెంత మహత్తరమో ఉద్ఘాటిస్తాడు. అప్పుడు అర్జునుడు యుద్ధం చెయ్యనన్నాడన్న విషయం మళ్లీ ప్రస్తావిస్తాడు. "అహంకారంవల్ల యుద్ధం చేయకూడదని నీవు భావించినా ఆ ప్రయత్నం ఫలించదు. ఎందువల్లనంటే, నీ స్వభావమే నీచేత యుద్ధంచేయించి తీరుతుంది" (18-59) అని కరాఖండీగా తేల్చిచేపేస్తాడు. స్వధర్మంవల్ల ఆ కర్మకు అర్జునుడు కట్టుబడిపోతాడు, తప్పదు అంటాడు. అయినా సర్వేశ్వరుడు

(తనుకాదా?) తన మాయతో అన్నిట్నీ కీలుబొమ్మలలాగ ఆడిస్తున్నాడని, ఆ ఈశ్వరుణ్ణే శరణువేడమనీ దారిచూపిస్తాడు (18.61.62). ఇంత చెప్పేక "నువ్వంటే నాకిష్టం. అందువల్ల నీ మేలుకోరి పరమ రహస్యమూ, సర్వోత్కృష్టము అయిన మరోమాట చెబుతాను విను" (18-64) అంటూ "నా మీదే మనసువుంచి భక్తితో పూజించు" అని ఉపదేశం చేస్తాడు. ఇప్పుడు పతాక సన్నివేశం వచ్చిందని భావించి కాబోలు -

*"సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ!*
*అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః!!*

సర్వ ధర్మాలనూ విడిచిపెట్టి నన్నే ఆశ్రయించు, పాపాలన్నిటి నుంచి నీకు విముక్తి కలగజేస్తాను. విచారించకు" (18, 66) అని పిండితార్థంగా మూడుగంటల ఉపన్యాసం తర్వాత తేల్చేస్తాడు.

ఇప్పటిదాకా అదేమిటీ, యిదెలాగ, కర్మేమిటి, భక్తియేమిటి అని శంకలు వెల్లడి చేసిన అర్జునుడు చేతులెత్తేసి "కృష్ణా! నీ దయవల్ల నా వ్యామోహం తొలగిపోయింది. జ్ఞానం కలిగింది. నా సందేహాలన్నీ తీరిపోయేయి. నీ ఆదేశాన్ని శిరసా వహించడానికి సిద్ధంగా వున్నాను" అని లొంగిపోతాడు.

ఈ సంవాదాన్ని తను విన్నతీరును ధృతరాష్ట్రుడికి సంజయుడు చెప్పడంతో యీ అధ్యాయం ముగుస్తుంది. మొత్తం 78 శ్లోకాలు యీ అధ్యాయంలో వున్నాయి.

భగవద్గీత పెద్దెనిమిది అధ్యాయాల్లో చర్చించిన విషయాలు యివీ.

ఈ ఉపదేశంలో వున్న భావాలన్నీ అంతకు ముందు లేని కొత్తవా? లేక వాటికి మూలాలు వున్నాయా? బౌద్ధమతం నుంచి చాలా వాటిని గ్రహించడం జరిగిందని ముందు చూశాం. కర్మసిద్ధాంతం ప్రధానంగా బౌద్ధులది. కాని అక్కడి అర్థం చేసిన పనులు, వాటి ఫలితం అన్నదే. జన్మజన్మల కర్మబంధం అన్నది కాదు. కాని మళ్ళీ ప్రాణం పోసుకున్న పౌరాణిక హిందూమతంలో కర్మభావం మారి సంసార చక్రంలో చిక్కుకుంది. పునర్జన్మలు దాన్నిబట్టే ప్రాప్తిస్తాయి. వర్ణవ్యవస్థను సుప్రతిష్ఠం చెయ్యాలని సంకల్పించిన మతానికి యీ భావన ఆనుకర్ర అవసరం.

శరీరం నశించినా ఆత్మ చావదు. ఈ భావన ఒక రకమైన ఊరటని కలిగించేదే. శాశ్వతంగా నరకంలోనూ, స్వర్గంలోనో వుండిపోయి అక్కడికి కథ ముగిసేటట్టు చెయ్యడం కాదు. ఇంకా యింకా అవకాశాలు వున్నాయి. ఈ జన్మలో కాకపోతే మళ్లీ యింకోజన్మలో పద్దు పుస్తకం మార్చి రాసుకోవచ్చు. "It pursues its long pilgrimage through dying bodies and decaying worlds. The great purpose of redemption is carried over without break from one life to another" (S. Radha krishnan, Hinduism). ఈ ఆత్మ అనశ్వర భావం కఠోపనిషత్ నుంచి గ్రహించిదే (దిలీప్ బోస్ భగవద్గీత, జాతీయోద్యమం). ఛాందోగ్యోపనిషత్ కూడా యిందుకు ఆధారం కలిగిస్తోంది. కర్మభావం ఈశావాస్యోపనిషత్ నుంచి గ్రహించినదని హిరియణ్ణ రాశాడు. ఒకవేళ అలా కాకపోయినా ముచ్చటగా ముందుపెట్టి ప్రాచుర్యం కలిగింపచేసింది గీతే. యిక్కడ కర్మ అంటే చెయ్యవలసిన పని. విధ్యుక్త ధర్మం. ఎవళ్లు చెయ్యవలసిన పని వాళ్ళు చెయ్యాల్సిందే. దీన్నుంచి తప్పించుకోకూడదు. స్థితప్రజ్ఞ భావం కూడా బౌద్ధంనుంచి గ్రహించినదేననీ, గాంధీ మహాత్ముని ఆశ్రమంలో రోజా యీ భాగాన్నే ఉపయోగించేవారనీ కోశాంబి రాశాడు. భక్తిభావం శ్వేతాశ్వతర ఉపనిషత్ నుంచి గ్రహించినటువంటిది. "భగవద్గీతలో ముఖ్యంగా కఠోపనిషత్ వాక్యాలను గ్రహించి తత్వబోధ చేశాడు" అని కంచి పరమాచార్య అన్నారు. బ్రాహ్మ నిర్వాణ భావం కూడా బౌద్ధులదే. "కర్మఫలం నుంచి తప్పించుకోడానికి బౌద్ధులు బోధించిన మార్గమే ఈ నిర్వాణం" (కోశాంబి). ఇదే మాదిరిగా సాంఖ్య, మీమాంస వేదాంత వరకూ యెన్నో చింతన ధోరణులు గీతలోకి భగవానుడి ఉపదేశం రూపంలో ప్రవేశించాయి. ఎవళ్లు యెలా నన్ను ఆరాధిస్తారో వాళ్లకి అల్లా అనుగ్రహం అందుతూ వుంటుంది (2-11) అని విశాల ప్రాతిపదికను కల్పించడంలో ఉద్దేశ్యం అప్పటికి అమలులోవున్న అన్ని ఆరాధనల్నీ యిముడ్చుకోవడమే. అదేరకంగా "The work breathes through out a spirit of toleration which is an outstanding characteristic of Indian thought" (హిరియణ్ణ. Outlines of Indian Philosophy) అనేక రకాల చింతనా ధోరణుల సమ్మేళనమే సహనానికి ప్రాతిపదిక.

ఇలా సమ్మేళన జరిపించినదానికి ప్రాతిపదిక యేమిటి? ఆ అవసరం యేమిటి?

బౌద్ధమతం క్షీణించడం, కొత్త రాజకీయ సంబంధాలు తెరమీదకు రావడం నేపథ్యం ముందే చూశాం. ఆ పరిస్థితులకు తగ్గ సైద్ధాంతిక పునాదిని అందించడానికి గీతని కల్పించడం జరిగింది. దాన్ని మహాభారతంలో యుద్ధసన్నివేశంలో అర్జునుడి సందేహాన్ని తీర్చడానికన్నట్టు సన్నివేశం యేర్పరిచారు. (ఈ సన్నివేశం అంత సమంజసంగా లేదని పండితులు అభిప్రాయపడ్డ విషయం ముందు చెప్పుకున్నాం.) అర్జునుడి శంక తిన్నది అరక్క వికటించి పుట్టుకొచ్చింది కాదు, భగవద్గీతలో సాత్విక, రాజస, తామసిక ఆహారాల గురించి భగవానుడు భిషక్‌లాగా వివరించినా కానీ, ఆ శంక యేమిటి? అప్పటిదాకావున్న సమాజంలో గణసంబంధాలు వుండేవి. రక్తసంబంధీకులే అంతా. శత్రువు అంటే పైవాడనే అర్థం వాళ్లకి. అలాంటిది "ఆచార్యాః పితరః..." (1.34) వున్న సైన్యం మీద ఆయుధాన్ని సంధించడమా? అప్పుడు యీ హననం తప్పుకాదని, కర్తవ్యోన్ముఖుణ్ణి చెయ్యడం శ్రీకృష్ణుడి లక్ష్యం. ఆ రకంగా బంధు వర్గహనన పాప భావాన్ని అర్జునుడు తొలగించుకోవాలి. ఆ పని ధర్మబద్ధమనే ఒప్పించాలి.

భగవద్గీత మూలభారతంలో వుందా లేదా అన్నది చర్చనీయం. బీజప్రాయంలో వుండి వుండచ్చునేమోననీ అదీ విజయం సాధిస్తే రాజ్యం, వీరమరణం పొందితే స్వర్గం లభిస్తాయన్న ఉత్తేజకరమైన మాటల్లాంటివి అనీ పండితులు అంటారు. సనాతనధర్మం మళ్లీ పునరుజ్జీవం పొందే సమయంలో వర్ణవ్యవస్థని పటిష్టం చేసుకుందుకు, పునర్జన్మ భావాన్ని పాదుకొల్పేందుకు, ఆత్మ శాశ్వతత్వాన్ని చాటుకుందుకు గీత ఉపకరించింది. వర్ణవ్యవస్థలో అంతరాలు అలానే వుంటాయి. వాళ్ల వాళ్ల స్వభావ కర్మలు వాళ్లు చెయ్యాల్సిందే. శూద్రుల స్వభావకర్మ సేవ చెయ్యడం అని చాటడంలో అంతర్లీనంగా వున్న ఉద్దేశం ఉత్పత్తి ప్రక్రియలో పైవర్గాలకి వూడిగం చెయ్యడమనే అంతేనా, స్వధర్మ నిర్వహణలో మరణించినా గొప్పే, యితరుల ధర్మాన్ని అనుసరించే భయావహ పరిస్థితికంటే (3.35, 18.45, 47) అని శాసించేడు. ఆరకంగా శూద్రుల్ని రెచ్చగొట్టద్దు సుమా అని హెచ్చరిక చేశాడు. బౌద్ధమతం బిగువు సడలించిన కట్టుబాట్లకి మళ్లీ బిగువు కలిగించేయత్నం గీతలో జరిగింది.

గీతలో వైశ్యులకీ, శూద్రులకీ, స్త్రీలకీ కలిగించిన అవకాశం యేమిటంటే - వాళ్లకీ మోక్షప్రాప్తి వుంటుందనే. అదీ యెప్పుడు? వాళ్ల వాళ్ల విహితకర్మలు ఆచరించడంద్వారా, భక్తిద్వారా. ఉపనిషత్తుల్లో యీ ప్రతిపాదన లేదు. "But what Yajnasalkya, the great authority of Upaniphadic spiritnal wisdom, had denied the geeta, after the body flow dilivered by Buddhism, so that wisdom, could not deny. The author of the geeta, conceded it, if not with grace, at any rase, with discretion." (S.G. Sardesai, Marxism and the Bhagavat Geeta - Page 18.)

ఇందుకు దారి యేమిటి? ఉపనిషత్తులో జ్ఞానమార్గం అని ఘనంగా కీర్తించేది వుంది. (అందుకనే కర్మకాండల వైదిక బోధనకు దూరం అని చాటడం.) అక్కడవున్న ఆత్మ, బ్రహ్మ భావాలు అందరికీ యేం మింగుడు పడతాయి? బ్రాహ్మణ, క్షత్రియవర్ణాలు ఆ బ్రహ్మజ్ఞాన అన్వేషణలో వుంటే కులాసాగా బతికే మార్గాలు యేమిటి? శ్రమించేవాళ్ల ఫలాలు వాళ్లకి దక్కాలి కదా! అందుకు శ్రమించేవాళ్లు కేటాయింపై వుండాలికదా? వైశ్య, శూద్రులు ఉత్పత్తి ప్రక్రియలో ప్రత్యక్షంగా పాల్గొంటే తాము వాటి ఫలితాల్ని హాయిగా అనుభవించవచ్చు అందుకు మార్గమే భక్తి. ఈ భక్తి భావం వేళ్ళు బౌద్ధంలో వున్నాయి. అయితే సిద్ధాంత సంబంధమైన రక్తమాంసాలు గీతలో దక్కాయి.

ఈ భక్తి వ్యక్తిగత భక్తి. "సేవకుడు- యజమాని, కౌలుదారు - భూస్వామి, చక్రవర్తి - సంపన్న వ్యాపారి - ఇలా వ్యక్తిగత విధేయతల వలయం" భూస్వామ్యవ్యవస్థలో ఆధారభూత అంశాలు. "ఈ రకమైన వ్యవస్థలో ప్రభుత్వాన్ని కాపాడడానికి భక్తి ప్రాముఖ్యం గల మతమే ఉపయోగపడగలుగుతుంది. వ్యక్తిలో ఎన్నిలోపాలు ఉన్నప్పటికీ, ఆ వ్యక్తిపై మూఢ విశ్వాసం చూపగల భక్తి ఈ ప్రభుత్వానికి అవసరం" (కోశాంబి).

"భగవద్గీత"లోని భక్తిభావం యిలా భూస్వామ్య వ్యవస్థకు అనువైందిగా కోశాంబి సూత్రీకరించేడు. పురాణాల్ని పరిపుష్టంచేసిన గుప్తయుగం దేవునిపట్ల భక్తి రాజుపట్ల భక్తిగా అవతరించడం దూరంకాదు. "నా విష్ణుః పృథివీ పతిః" అని (విష్ణు అంశలేనివాడు రాజ్యపాలకుడు కాలేడు) సూత్రీకరించిన ఫ్యూడల్ నేపథ్యంలో విధేయత, భక్తి యెంతో అవసరం. భగవద్గీతలో యీ భక్తిభావం ఆనాటి సాంఘిక సమస్యలకి కొంత పరిష్కారంగా కనిపించింది.

"భగవద్గీత" అనేక రకాల వ్యాఖ్యానాలకి ఆలంబన అయిందన్న విషయం తెలిసిందే. యుద్ధసన్నివేశకల్పన, అర్జునుడి విషాదం భూమికగా వున్నాయి. ఆ సందర్భంలో కార్యాచరణకు నడిపించే బోధే అవసరం. అదే కృష్ణుడు ఉపదేశించింది అని చాలామంది అభిప్రాయపడ్డారు. పాతధర్మం, కొత్త జీవితవిధానం ఘర్షణకు దిగినప్పుడు యేం చెయ్యాలి? మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చుంటే పుణ్యకాలం గడిచిపోతుంది. అలాంటప్పుడు కార్యాచరణకు దిగాలి. ఎలాంటి కార్యాచరణ? "స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి!" (2-31) (స్వధర్మం తెలుసుకుని అయినా నువ్వుచంపద్దు) యేమిటా స్వధర్మం? క్షత్రియుడి కాబట్టి ధర్మయుద్ధాన్ని మించిన మహాభాగ్యమేం వుంటుంది? నీ పని చెయ్యవలసింది చెయ్యడమే. మిగతా విషయాలు నీకనవసరం" యీ విషయాన్నే ఒకటికి రెండుసార్లు ప్రకటిస్తూ ఉద్బోధ చేశాడు. అందుకు గీత కర్మప్రాధాన్యాన్ని యెత్తి చూపిస్తోందని లోకమాన్య తిలక్ లాంటి వాళ్లు భావించేరు. జాతీయోద్యమ కాలంలో యీ సందేశం చాలామంది దేశభక్తుల్ని ఉత్తేజపరచింది తిలక్ కర్మయోగాన్ని చాటిచెప్పి శంకరుల జ్ఞానయోగ ప్రాతిపదికను విమర్శించేరు. (తిలక్ బర్మా మాండలే జైల్లో ఆరేళ్ల నిర్బంధం అనుభవించినప్పుడు పెన్సిల్‌తో గీతా రహస్యం రాశేరు. ఆయన దానికి గీతా రహస్యం లేదా కర్మయోగ శాస్త్రం అని పేరు పెట్టేరు. ఈ శీర్షికను బట్టే ఆయన గీతను వ్యాఖ్యానించిన తీరు, అవగాహన చేసుకున్న రీతి తెలుస్తాయి.)

భగవద్గీతకు ఆదిశంకరులు భాష్యం రాశేరు. ఆది శంకరులు వేదాంత జ్ఞాన మార్గాన్ని చివరికంటా తీసుకుపోయేరు. జ్ఞాన మార్గంద్వారా 'సన్యాసం' - నిజంగా అది జీవిత కార్యకలాపాల నుంచి పలాయనం చిత్తగించే సన్యాసమే - మోక్షం పొందడం గీతనుంచే ఆయన గ్రహించేరన్నది నిర్వివాదం. కర్మయోగానికీ యీ అద్వైత జ్ఞాన మార్గానికీ పొంతన వుండదు. శంకరులవాదం ఆనాటి నిరాశానిస్పృహలకు అద్దం పట్టేటట్టేవుంది. కర్మత్యాగం నివృత్తి యీ ప్రపంచమే భ్రమానిత్యం, మాయ అయినప్పుడు కర్మ దేనికి? అంచేత జ్ఞానమార్గంద్వారా మోక్షప్రాప్తి కలగాలి. ప్రవృత్తి ధోరణి అంటే లోక వ్యవహారంలో అన్ని బాధ్యతలనీ నిర్వహిస్తూ సాగడం. శంకరుల వ్యాఖ్యని తిలక్ అంగీకరించలేదు. గీత ఉద్బోధించింది

కర్మ మార్గమే. బ్రిటిష్ వాళ్లకి వ్యతిరేకంగా పోరాడ్డానికి మార్గం యిదే, అద్వైత వేదాంతానికీ కర్మయోగానికీ పొత్తు కుదరని అంతరం వుందని తిలక్ అభిప్రాయపడ్డాడు.

గాంధీజీకి గీత అహింసామార్గం చూపించే కరదీపిక అయింది. అహింసామార్గాన్ని స్థితప్రజ్ఞుడైనవాడే సక్రమంగా నుసరించగలడని గాంధీజీ అభిప్రాయం. గాంధీజీ అహ్మదాబాద్ ఆశ్రమంలో పదినెలలపాటు (ఫిబ్రవరి నుంచి నవంబరు 1926 వరకు) యీ విషయమే ఉపన్యాసాల్లో ప్రస్తావించేవారు. (ఆయన వైఖరిలోని వైరుధ్యం 1930 సహాయ నిరాకరణ ఉద్యమంలో వెల్లడైంది. అప్పట్లో పెషావర్‌లో ఆందోళన తీవ్రంగా సాగుతోంది. నిరాయుధులైన గుంపుమీద కాల్పులు జరపడానికి గర్వాల్ సైనికులు నిరాకరించేరు. వాళ్లచర్యని గాంధీజీ సమర్థించలేదు. సైనికులు వాళ్ల స్వధర్మపాలన చెయ్యాలని ఆయన అభిప్రాయం. మరి అహింసా తత్వం యెవరికి? ఆందోళనకారులకే నన్నమాట!) తిలక్ మహాశయులకీ గాంధీ మహాత్మునికీ హింస, అహింసల గురించే వాగ్వాదం జరిగింది. అయితే ఆ యిద్దరికీ బ్రిటిష్ సామ్రాజ్యవాదం గురించి మౌలికంగా ఏకాభిప్రాయమే వుంది.

ఇక స్వామీ వివేకానందులు రాజసిక ధర్మాన్ని బోధించేరు. శారీరక శక్తిని సమకూర్చుకోవాలి. అది లేకుండా మానసిక శక్తి రాదు. భగవద్గీత అలాంటి శక్తి సముపార్జనకు దారి చూపిస్తుందని ఆయన విశ్వాసం.

ఇక వర్ణవ్యవస్థ గురించి గీతలో చెప్పిందానికీ యీ మహావ్యాఖ్యాతల భాష్యాలకీ ఏకత లేదు. వివేకానందులు వర్ణవ్యవస్థను అంగీకరించలేదు. అంతేకాకుండా, మార్క్సిస్టు పద్ధతిలో సామాజిక దశలను వర్ణవ్యవస్థపరంగా విశ్లేషించారు. బ్రాహ్మణ శిష్టపాలన, తర్వాత శక్తివంతమైన క్షత్రియ ఫ్యూడల్‌పాలన, వైశ్యుల పెట్టుబడిదారీపాలన. రాబోయేది శూద్రులది, అంటే శ్రమజీవులది. అరవిందులు వర్ణవ్యవస్థలో జన్మతః సంక్రమించే హెచ్చుతగ్గుల్నికాక వాళ్లవాళ్ల విధుల కేటాయింపును దర్శించేరు. గాంధీజీ తను సనాతనిస్టునని చెప్పుకుని, వర్ణవ్యవస్థ సైన్యంలో అధికార విధుల విభజన వంటిదని అభిప్రాయపడ్డారు. ఇక గురుగోల్వాల్కర్ వర్ణవ్యవస్థ ఒక సాంఘిక శ్రేణి అనీ వివక్ష చూపించే కుల వ్యవస్థ కాదనీ భావించేరు. వర్ణవ్యవస్థలో హెచ్చు తగ్గులు యిటీవలి కాలానివనీ, బ్రిటిష్‌వాళ్ళు,

ముస్లిమ్ పాలకులూ కల్పించినవనీ అభిప్రాయపడ్డారు. సామాజిక జీవితంలో యెవళ్ల పాత్ర వాళ్లు నిర్వహించాలని నిర్దేశించడమే వర్ణవ్యవస్థ ధ్యేయమని ఆయన భావన. అయితే "పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్" (18.44) అని నిర్దేశించినప్పుడు? స్వభావసిద్ధంగా సేవ చెయ్యడానికి యెవళ్లన్నా ముందుకు వస్తే ఐచ్ఛికసేవగా దాన్ని గుర్తించవచ్చు. కాని జన్మతః శూద్రుడవడం, సేవచెయ్యడం వంటివే స్వభావసిద్ధం అని యెవళ్లు అంగీకరిస్తారు? దీనికి హేతుబద్ధమైన జవాబు లేదు.

భగవద్గీతలో జ్ఞాన, కర్మ, భక్తి యోగాలు యెన్ని చెప్పినా, తాత్వికంగా యెన్ని విభేదాలువున్నా కార్యాచరణకు నడిపించే సిద్ధాంత భూమిక యేమన్నా అందించిందా? భక్తి మార్గంద్వారా, భగవానుణ్ణి దాసోహం అని ఆశ్రయించడం ద్వారా విముక్తి కలుగుతుందన్న విశ్వాసంతో ఊరటని అందించింది. అందరిలోనూ ఆత్మ ఒకటేనన్న భావం మానసిక పరిధిలో సమానత్వాన్ని అందించింది. సాంఘిక భౌతిక వాస్తవికతలో కాకపోయినా అణగారిన వర్ణాలు పురోహిత వర్గం మీద తిరుగుబాటు చేశాయి. కపట దాంభిక ఆధిక్యం మీద దాడిచేశాయి. భక్తి మార్గంలోకి అణగారిన వర్ణాలన్నీ వచ్చేయి. అయితే దానివల్ల భౌతికంగా తీవ్రవైరుధ్యం తలెత్తి, భక్తి వాగ్గేయ బోధకుల్ని బ్రాహ్మణ పురోహిత వర్గం మరింత అణిచేటట్టు చేసింది. భగవద్గీత భక్తి బోధనకు యదార్థంలో లభించిన ఆదరణ అదీ! స్వాతంత్ర్య పోరాటంలో భగవద్గీత బోధనను స్మరిస్తూ ఉరికంబం యెక్కిన ఖుదీరామ్‌బోస్ వంటి అమరజీవులు ఆత్మ అనశ్వర భావంతోనే అంతటి త్యాగాలు చేశారు. హైందవ దేశభక్తులు యిలా భగవద్గీతను అసరాగా తీసుకుంటే, ముస్లిం దేశభక్తులు కొరాన్‌ని అలా ఆధారం చేసుకున్నారన్న విషయాన్ని మరిచిపోకూడదు.

భగవద్గీతలో ఉద్బోధించిన "స్థితప్రజ్ఞ" భావం గాంధీజీకి అహింసామార్గ బోధకం అయింది. అయితే నాయకత్వస్థానంలో వున్నవాళ్లకి యిలాంటి తత్వం అవసరమేనన్నది గుర్తించాలి. స్థితప్రజ్ఞుడు ఆదర్శ ప్రాయమైన వ్యక్తి అని చెప్పవచ్చు "Many rationally - minded people who do not accept the hosch - poem of the geeta are still tremandously impressed by its characterization of the sthitaprajna

(II 54-72) they see in him the ideal that every noble - minded person should strive to reach" (S. G. Sardesai, Marxism and the Bhagavat Geeta, Page 23). అయితే భగవద్గీతలో వర్ణించిన స్థితప్రజ్ఞుడు భౌతిక సామాజిక కార్యాచరణకు నడుంబిగించే స్థితప్రజ్ఞుడుకాదు. అతని వైరాగ్యం, చిత్తశాంతి, ఆత్మ సంయమనం బ్రహ్మ స్వరూపంలో సాదృశ్యం చూసుకోవడం నుంచి పుట్టుకొచ్చినవే కాని మరెందుకూ కాదు. ఉపనిషత్తుల్లో "అహం బ్రహ్మోస్మి" - నేనే బ్రహ్మను, అన్న ప్రతిపాదనతో సమసిస్తుంది ఇది వ్యక్తి నిష్టమైన భావం. తాబేలులాగా ఇంద్రియ గ్రాహ్యతను లోపలికి ముడుచుకోవడం అని గీతలోనే చెప్పాడు. అలాంటి ధోరణిలో కాకుండా సమర్థవంతమైన నాయకత్వ లక్షణానికి, ప్రజాపక్షం వహించే విప్లవవాదులకు అవసరం అయిన స్థితప్రజ్ఞత్వం వేరు. పోరాట మార్గంలో ఒడిదుడుకులు యెదురైనా లక్ష్యశుద్ధి పోగొట్టుకోకుండా చేసే లక్షణం కావాలి.

భగవద్గీత బౌద్ధ మతప్రాభవం తర్వాత, మగధ సామ్రాజ్య అస్తమయం తర్వాత పుంజుకున్న వైదిక మతానికి సిద్ధాంత భూమికగా పనిచేసింది. భిన్న సిద్ధాంతాల్ని సంపుటీకరించింది. క్రీ.శ. రెండవ శతాబ్దం నాడు దాన్ని కూర్చవలసిన సామాజిక నేపథ్యం యేమిటైందీ కోశాంబి వివరించేడు. అయితే యింకా అంతకుముందే, బౌద్ధయుగ పూర్వమే, దాన్ని కూర్చినట్టు కొందరు అంటున్నారు. బౌద్ధమత పూర్వదశది కాదన్న విషయం యదార్థం.

స్వాతంత్ర్య పోరాటంలోనూ దేశభక్తుల్ని ఉత్తేజితం చేసే పాత్ర పోషించింది. ఆత్మకు చావులేదు. శరీరం నుంచి శరీరానికి మారుతుంది. అంచేత దాన్నిగురించి శోకించనవసరం లేదు. ఈ భావంతో త్యాగాలు చేసే ఉత్సాహం కలిగింది.

భగవద్గీత బోధన జ్ఞాన, కర్మ, భక్తి యోగాల చుట్టూ పరిభ్రమించినా మౌలిక చట్రం మాత్రం చాతుర్వర్ణసిద్ధాంతం, వేదాంత బ్రహ్మభావం. చాతుర్వర్ణ విభజన గురించి యెవరేమి వ్యాఖ్యానం చేసినా జన్మతః సంక్రమించే హెచ్చుతగ్గులే. ఇక వేదాంత బ్రహ్మభావం మార్మికం. ఎంతమంది యెన్ని రకాలుగా గీతను గురించి వ్యాఖ్యానించినా యీ చట్రం మాత్రం మారలేదు.

ఈ చట్రం ఆధారంగా పుట్టుకొచ్చిన సిద్ధాంతం ఆధునిక జీవిత చిక్కుముళ్లను యెలా విప్పుతుంది? ఇవాళ బిర్లాలు దేశవ్యాప్తంగా గీతా యజ్ఞాలు, వేదాంత ఉద్బోధలు సాగిస్తున్నారు. ఆంధ్రదేశంలో అనేకమంది మఠాధిపతులు పోటా పోటీలమీద గీతాయజ్ఞాలు నిర్వహించేస్తున్నారు. బ్రహ్మ పదార్థాన్ని జనాలకి అందించాలని తపించేస్తున్నారు. గీతవల్ల సామాజిక చైతన్యం పెరిగి, ఆధునిక సమస్యలకు పరిష్కారం లభించే దారివుందా? గీత భారతదేశ చింతనలో, మనసుల్లో ఒక స్థానం సంపాదించుకుంది. కాబట్టి దాన్ని వాడుకునే సాంఘిక విమోచన పోరాటం చెయ్యవచ్చు కదా అన్న అభిప్రాయాల్ని కొందరు వెల్లడిచేస్తున్నారు. ఈ సూచనలు ముచ్చటగానే కనిపించవచ్చు. కాని ఆధునిక జీవిత సమస్యల పరిష్కారానికి ఆధునిక సిద్ధాంతాలు దోహదపడతాయి గాని, యెంత ఘనకీర్తిగలవైనా పాతజీవిత దృక్పథాన్ని తవ్వి తలకెక్కించే సిద్ధాంతాలు కాదు.

భగవద్గీత అందరికీ మోక్షం లభించే మార్గం చెపుతున్నట్టు రంగంమీదకు వచ్చింది. అయితే సాంఘిక అసమానతలను తొలగించే దీపం యేదీ చూపించలేదు. పైపెచ్చు ఆనాటి సాంఘిక ఉత్పత్తి విధానానికి నప్పిన ఆ అంతరాల్ని అలానే శాశ్వతం చేసింది. ఒట్టినే సేవ చెయ్యడం, అలా స్వధర్మం నిర్వర్తించి తరించడం మీ వంతు అని ఒక సాంఘిక అంతస్తును బోధించింది. దీనికి మీరు జ్ఞానం, కర్మం అనే యోగాలు నానా హైరానాపడి ఆచరించనవసరం కూడా లేదు సుమా, ఒట్టి భక్తి చాలు. చేతులెత్తేసి భగవానుకి దాసోహం అయితే చాలు - అన్నీ అవే సద్దుకుంటాయి. యెంత చక్కని సలహా! అలాగే "పణ్డితా స్సమదర్శినః" (5-18) అన్నది వుండనే వుంది. ఆత్మజ్ఞానులైన మహనీయులు అందర్ని సమదృష్టితో చూస్తారు, తెలుసా? అయితే అసలా హెచ్చుతగ్గులు ముందు యెలా వచ్చేయి? అవి లేకుండాపోతే సమదృష్టి వస్తుంది కదా? అని అడగకండి. ఏమంటే, హెచ్చుతగ్గులు వుంటేనే కదా సమదృష్టి విలువ తెలియవచ్చేది. పాపం, శ్వపాకే ఛండాలుడు - గుణంరీత్యా కాదు పుట్టుక వల్ల-) కుక్క తర్వాత సమదృష్టిని పండితుని నుంచి పొందుతాడు! తాను అలాంటి పుట్టుక యెందుకు పొందాలీ అని అడగలేదు.

ఇవాళ చాలా మఠాలు ఉపనిషత్ ఆలోచనా ధోరణీ, భగవద్గీత సారాన్నీ రోజూ కంకణం కట్టుకుని ప్రచారం చేస్తున్నా. వీటినుంచి ప్రజలకు యేం అందుతోంది? క్రియాశీలమైన దృష్టి కాదు, కార్యాచరణకు నడిపించే మార్గంకాదు. సంఘర్షణలనుంచీ సమస్యల నుంచీ పారిపోయి, మానసిక ఊరటపొందే దారి.

మార్క్సిజం - భగవద్గీత యే సంబంధంతో వుంటాయి? ఇది చిత్రమైన ప్రశ్న. భగవద్గీత కర్మయోగం మనకి యీనాడు యేమీ అందివ్వదా? మార్క్సిజం కార్యాచరణకు నడిపించే సిద్ధాంతం కదా, అందుకు ఉపయోగించే అంశాన్ని గీతనుంచి తీసుకోలేదా? అనిపించవచ్చు. అసలు జీవిత దర్శన పునాదులే వేరుగా, స్పర్థించేవిగా వున్నప్పుడు వాటిమీద నిర్మించే కార్యాచరణ భవనాలు ఆ ఆకారంలోనే వుంటాయి, గాని మరోలా వుండవు. కర్మయోగం అన్న భావనే చాలదు. అందుకు తగ్గ ఆచరణ ప్రణాళిక కావాలి.

ఇలాంటి నేపథ్యంలో భగవద్గీతకీ మార్క్సిజానికీ పొంతన యేమన్నా వుంటుందా? మార్క్సిజం సమాజ విశ్లేషణ యెలా చేస్తుందో తెలుసు కుంటేనేగాని దీనికి సమాధానం రాదు. భగవద్గీత చాతుర్వర్ణవ్యవస్థ, వేదాంతతత్వం చట్రంలో వుందని చూశాం. ఎవరు యెంత సమర్థనీయంగా చెప్పినా వర్ణవ్యవస్థ అమలులో వున్నతీరు హెచ్చుతగ్గుల అంతరాలలోనే వుంది. ఈ అంతరాలు పోతేనేగాని భౌతిక జీవితం సుప్రతిష్టితం కాదు. ఇవి పోవడానికి వర్గచైతన్యం కావాలి. వర్ణం, వర్గం, సాంఘికంగా ఆర్థిక పరిస్థితిని ప్రతిబింబించేవే కదా అనిపించవచ్చు. ""Caste is class on a primitive level of production" అని కోశాంబి రాశేడు. అయితే వర్గం, వర్ణం యిదేస్థితిలో సర్వదా లేవు. "And class cuts through cast just as cast cuts through class one or the other. The two cannot become bed - fellows" (Sardesai, Markism and the Bhagavat geeta P.33). అంచేత సాంఘిక సమానత్వం సామ్యవాద వ్యవస్థ రావాలీ అంటే పరిస్థితి మారాలి. ``The struggle for socialism is inconceivable without rousing the class consciousness and forging the class unity of the toiling masses" యిదే గ్రంథం. పే. 33).

భగవద్గీత యీ మార్గం చూపించలేదు. స్వభావ కర్మలు చెయ్యి, నీ స్వభావం యీ వర్ణాల వచ్చింది తెలుసా అని బోధించే సిద్ధాంతం వర్గచైతన్యాన్ని యెలా అందివ్వగలదు? అందించక పోవడమేకాకుండా అలాంటిది కలగకుండా ఆటంకపరుస్తుంది. ఎలాగంటే, నీ కష్టాలకి విరుగుడు నన్ను శరణు వేడుకోవడమే, అన్నీ మరచిపో, అన్నిటినీ వదిలెయ్యి, నేనే నీకు ఊరట అందిస్తా అని చెపుతూ సమస్యల నుంచి పారిపోయే దారి చూపిస్తుంది.

భగవద్గీత చారిత్రక పరిణామంలో హిందూ ధర్మం అని వ్యవహరించే జీవితవిధానానికి ప్రామాణిక మతగ్రంథం అయింది. సాంఘికంగా అది యివాళ పురోగమన పథం వేపు మళ్లించే మార్గం అందించలేదు. ఈ విషయం బోధపడితేగాని శ్రామికజన విముక్తి పోరాటం ముందుకు సాగదు.

"The point is that the Geeta and Vedantic idealism cannot become the ideological basis of the struggle for socialism" (యిదే గ్రంథం పే. 35)

అయితే గీత "is characteristically Indian in attempting to reconcile the irreconcilable, in its power of pulping down sharp contradictions painlessly" (కోశాంబి). గీత యివాళ సాంఘికంగా నిర్వహించగలిగిన పాత్ర యేమీలేదు. అయితే చక్కని ఉపమానాలతో, సంభాషణాత్మకంగా నాటకీయ ఫక్కీలో సాగిన తీరు ఆహ్లాదం కలిగించ వచ్చు. "The Geeta or for the matter of that any other religious classics or scriptures can still be enjoyed for their artstic value and as a source material to understand our ancienet past" (Dilip Bose, యిదే గ్రంథంలో పేజీ 76).

మార్క్సిస్టు గతితార్కిక చారిత్రక భౌతికవాద సిద్ధాంతం పునాదిగా గతాన్ని అర్థం చేసుకుందుకు గీత యిలా ఉపయోగపడవచ్చు.



# మీరు చదివారా?

## చరిత్ర, తత్వశాస్త్రం, సామాజిక, రాజకీయ, ఆర్థికశాస్త్ర గ్రంథాలు

| | | రూ. |
|---|---|---|
| 1. | యూనివర్సిటీల్లో జ్యోతిషం అవసరమా? - ఎబికె ప్రసాద్ | 10 |
| 2. | హిందూమతం, కులవ్యవస్థ, భారతీయ సంస్కృతి-ఆర్వియార్ | 40 |
| 3. | ఆంధ్రుల చరిత్ర - డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు | 180 |
| 4. | ఆంధ్రుల చరిత్ర - ముత్యాల ప్రసాద్ | 30 |
| 5. | కార్ల్‌మార్క్స్ - పెట్టుబడి 3 సంపుటాలు | సెట్ 650 |
| 6. | గదర్ వీరగాధ - కె. ప్రతాపరెడ్డి | 20 |
| 7. | స్వాతంత్ర్య సమరంలో కమ్యూనిస్ట్ దేశభక్తులు - పరకాల పట్టాభిరామారావు | 125 |
| 8. | ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర - ఏటుకూరు బలరామమూర్తి | 50 |
| 9. | భారతీయ సంస్కృతి - ఏటుకూరు బలరామమూర్తి | 45 |
| 10. | భారతీయ తత్వశాస్త్రం - ఏటుకూరు బలరామమూర్తి | 50 |
| 11. | మన చరిత్ర - ఏటుకూరు బలరామమూర్తి | 50 |
| 12. | ఉపనిషత్ చింతన - ఏటుకూరు బలరామమూర్తి | 22 |
| 13. | సామాజిక శాస్త్రాలకు కాలం చెల్లిందా!-ఆచార్య వి. రామకృష్ణ | 10 |
| 14. | భారతదేశ చరిత్ర రచనలో మతతత్వం - రొమిల్లా థాపర్, తదితరులు | 10 |
| 15. | చంద్ర రాజేశ్వరరావు వ్యాసావళి - (1968-73) వేర్పాటు వాద ఉద్యమాలు | 10 |
| 16. | ప్రాచీన భారతదేశ చరిత్ర - ఆర్.ఎస్. శర్మ | 90 |
| 17. | విద్య కాషాయీకరణను ప్రతిఘటిద్దాం! - ఆర్వియార్ | 5 |
| 18. | కృతయుగం (ఒక వక్రీకరణ) - ప్రొ. కె. శేషాద్రి | 10 |

ప్రతులకు: **విశాలాంధ్ర బుక్ హౌస్‌లు,**

**ప్రముఖ పుస్తక విక్రేతలు.**